బొమ్మల

# అల్లాఉద్దీన్ అద్భుతదీపం

2402
R01



రెంటాల గోపాలకృష్ణమూర్తి

నవరత్న బుక్ సెంటర్
ఏలూరు రోడ్, * విజయవాడ-520002

# మా స్వంత ప్రచురణలు

బొమ్మల శ్రీ షిర్డీసాయి జీవిత చరిత్ర
" అక్బర్ బీర్బల్ వినోద కథలు
" తెనాలి రామకృష్ణుని సంపూర్ణ హాస్య కథలు
" ఆలీబాబా 40 దొంగలు
" అల్లావుద్దీన్ అద్భుతదీపం
" గలివర్ సాహస యాత్రలు
" శ్రీ శ్రీ శ్రీ మర్యాదరామన్న కథలు
" భట్టి విక్రమార్కుని సాహస కథలు (2 భాగాలు)
" భేతాళ కథలు
మొగల్ సామ్రాజ్య కథానాయకులు
" ప్రవక్త మహమ్మద్
" ఏసుక్రీస్తు కథలు
" మథర్ థెరిసా
" రవీంద్రనాథ్ ఠాకూర్
" యోగివేమన
" భగత్ సింగ్
" అంబేద్కర్
" యశ్‌పాల్ కపూర్
" భగవతీచరణ్
" సుభాస్‌చంద్రబోస్
" చంద్రశేఖర ఆజాద్
" జయప్రకాష్ నారాయణ్
" సంఘసంస్కర్త రాజారామమోహనరాయ్
" పూజ్యబాపూజీ

బొమ్మల పంచతంత్రం (2 భాగాలు)
" రామాయణం
" భాగవతం
" దశావతారాలు
" శ్రీకృష్ణ లీలలు
" పరమానందయ్య శిష్యులు
" శ్రీ వెంకటేశ్వర లీలలు
" శ్రీ అయ్యప్ప లీలలు
" శ్రీరామపట్టాభిషేకం
" జై వీరహనుమాన్
" పల్నాటి వీరచరిత్ర
" బాలనాగమ్మ
" శ్రీ కాళహస్తి మహాత్మ్యం
" శ్రీశైలక్షేత్రమహాత్మ్యం
" శ్రీ సింహాచలక్షేత్రము
" శ్రీ యాదగిరి నరశింహస్వామి చరిత్ర
" శ్రీ కాశీ రామేశ్వర మజిలీల కథలు
" కోటప్పకొండ చరిత్ర
" శ్రీ వినాయక విజయము
" శ్రీ భద్రాచల మహాత్మ్యం
" శ్రీ పాండురంగ లీలలు
" కనకదుర్గ మహాత్మ్యం
" శివలీలలు

# అల్లాఉద్దీన్ అద్భుతదీపం

చాలా చాలా సంవత్సరాల క్రిందటి సంగతి. అరేబియా దేశంలో భారతదేశంలోలాగానే అనేకమంది మహారాజులు, చక్రవర్తులు ఉండేవారు. అంతే కాక వింతలకు, విచిత్రాలకు ఆ దేశం పెట్టిందిపేరు. మాయాజాలాలకు, మాంత్రికులకు చాలా ప్రసిద్ధి కెక్కింది ఆ దేశం. అక్కడ ప్రజలను అరబ్బులంటారు. వారి భాష అరబ్బీ భాష. వారి మతం ఇస్లాం మతం. అరబ్బులు వ్యాపారం చేయడంలో ఎంతో పేరు గడించారు. దేశంలో చాలా భాగం, ఎడారి ప్రాంతం కావడంవల్ల వారు ఒంటెలమీద సరకులను ఒక ప్రదేశం నుంచి మరొక ప్రదేశానికి తీసుకొని పోయి, అమ్ముకుంటూ ధనం గడించేవారు.

"అరేబియన్ నైట్స్" అనే కథలు ప్రపంచ ప్రఖ్యాతిని పొందినవి. ఇవి వెయ్యిన్నొక్క కథలున్నట్లు చెబుతారు. ప్రపంచంలోని దాదాపు అన్ని భాషలలోనికి ఇవి తర్జుమా అయ్యాయి. ఆ కథలలో "అల్లావుద్దీన్ అద్భుత దీపం" అనే కథ లోక ప్రసిద్ధి చెందినది. బాలలూ! ఆ కథే మీకిప్పుడు చెబుతాను.

మక్కా నగరంపేరు విననివారు ఉండరు. ముస్లింలకు అది పవిత్ర యాత్రాస్థలం. మహమ్మదీయుడైనవాడు జీవితంలో కనీసం ఒక్కసారైనా

మక్కా యాత్రచేసి, జన్మ చరితార్థం చేసుకోవాలని అనుకుంటాడు. ప్రవక్త మహమ్మదు జన్మించిన పరమ పవిత్ర స్థలమైన మక్కాకు వెళ్ళి, అక్కడ మసీదును దర్శించి తరించాలని కోరుకుంటాడు. ఆ మహానగరంలో ఎన్నో పవిత్రమైన మసీదులున్నాయి. అంతేకాక ఎందరో శ్రీమంతులు పెద్దపెద్ద భవంతులలో, మేడలలో సకల ఐశ్వర్యాలతో తులతూగుతూ ఉంటారు. అలాగే ఎంతోమంది నిరుపేదలు కూడ అక్కడ నివసిస్తూ ఉంటారు. పేదవారి పేటలు, గుడిసెలు అక్కడ లెక్కలేకుండా ఉంటాయి.



అల్లావుద్దీన్ తల్లి బుద్దులు చెప్పుట

"ఉంటే నవాబు, లేకపోతే పకీరు" అన్న సామెతగా కలవారు ఎన్నో భోగవిలాసాలతో కులుకుతూ ఉంటే, లేనివారు మురికి వాడలలో తిన తిండి, కట్టు బట్ట లేకుండా నికృష్ట జీవితం గడుపుతూ ఉంటారు. ఆ నగరంలో ముస్తఫా అనే దర్జీవాడున్నాడు. అతడు చాలా బీదవాడు. అతని భార్య వట్టి అమాయకురాలు. చాలా మంచిమనిషి. వారికి ఒక్కడే కొడుకు. దేవుడైన అల్లా పేరుమీద, "అల్లావుద్దీన్" అని ఆ పిల్లవాడికి పేరు పెట్టారు. ఒక్కడే కుమారుడు కావడంవల్ల తల్లిదండ్రులకు అతనంటే ఎంతో ప్రేమ. తల్లి మరీ గారాబంగా చూచుకునేది. ముస్తఫా గుడ్డలు కుట్టి, వచ్చే కొద్ది సంపాదనతో ఎంతో కష్టంమీద సంసారం పోషించుకుంటూ ఉన్నాడు. కాని, అల్లాఉద్దీన్‌కు చదువు సంధ్యలు అబ్బలేదు. వాడు అల్లరి చిల్లరిగా, మురికివాడలలో ఉండే కొంటె పిల్లలతో కలిసి తిరుగుతూ, గోలీకాయలు మొదలైన ఆటలు ఆడుతూ అస్తమానం గడుపుతూ ఉండేవాడు. తండ్రి ముస్తఫా, కుమారుడికి ఎన్నోసార్లు బుద్ధులు చెప్పాడు. తల్లి కూడ అప్పుడప్పుడు మందలిస్తూ ఉండేది. అయినా అల్లాదీవున్‌కు బుద్ధి రాలేదు. అతని ప్రవర్తన మారలేదు. ముస్తఫా తన దురదృష్టాన్ని తలుచుకుంటూ, కాలం వెళ్ళదీస్తూ వచ్చాడు.

ఇలా ఉండగా, అల్లాఉద్దీన్ పదేళ్ళ కుర్రవాడుగా ఉన్నప్పుడు, అతని తండ్రి ముస్తఫా చనిపోయాడు. అప్పుడా తల్లీ కొడుకులు దిక్కులేని వాళ్ళయినారు. తోటి ముస్లిమ్‌లు వారి దీనావస్థను చూచి, "అయ్యోపాపం" అనే వాళ్ళే కాని, తగిన సహాయం చేసేవారుకారు. ముస్తఫా భార్యకు, ఇల్లు గడపటం చాలా కష్టంగాఉండేది. ఆ ఇంట్లో ఈ ఇంట్లో అనేక రకాల పనులుచేసి, సంపాదించిన ధనంతో ఎలాగో కొడుకు అల్లాఉద్దీన్‌ను పోషించుకుంటూ వచ్చింది. కాలం గడిచింది. అల్లాఉద్దీన్ పదిహేనేళ్ళ వాడైనాడు.

ఇలా ఉండగా, ఒకనాడు ఒక మాంత్రికుడు అక్కడికి వచ్చాడు. పిల్లలతో కలిసి బజారులో ఆడుకుంటూఉన్న అల్లాఉద్దీన్‌ను చూచాడు. వాడి వాలకాన్ని జాగ్రత్తగా పరీక్షించాడు. తనకు కావలసిన కుర్రాడు అతనేననీ, తన కార్యము అతని ద్వారానే సాధించుకోవచ్చుననీ గ్రహించాడు. అక్కడే ఆడుకుంటున్న మరో పిల్లవాడిని పక్కకు పిలిచి, అతని ద్వారా అల్లాఉద్దీన్ వివరాలన్నీ తెలుసుకున్నాడు. ఎంతో పరిచయమున్న వాడి లాగా అల్లాఉద్దీన్ దగ్గరికి వెళ్ళి, "ఏరా నాయనా! ఎలా ఉన్నావురా? ఎంత కాలానికి చూసాను నిన్ను?" అని ప్రేమగా పలకరించాడు. కుర్రవాడైన అల్లాఉద్దీన్‌కు, అతనెవరో తెలియదు. అందుచేత బిత్తరపోయి చూచాడు. అది కనిపెట్టి మాంత్రికుడు, "ఏరా నాయనా! నేనెవరో అని అనుకుంటున్నావా? పిచ్చి సన్నాసీ! నేనెవరినో కాదురా! మీ చిన్నాన్నను మీ ఇంటికి పోదాం పద! మీ నాన్నా, అమ్మా బాగున్నారా? నేను, వాళ్ళను చూచి ఎన్నో ఏళ్ళు అయింది" అని అంటూ, అల్లాఉద్దీన్‌ను దగ్గరికి తీసుకొని ముద్దులాడాడు.

పాపం పసివాడైన అల్లాఉద్దీన్ అతను చెప్పినదంతా నిజమేనని నమ్మి, ఎక్కడలేని సంతోషంతో మాంత్రికుడిని వెంట బెట్టుకొని, తన ఇంటికి తీసుకొని వెళ్ళాడు. "రాండి చిన్నాన్నా! ఈ గుడిసే మా ఇల్లు. ఉండండి! మా అమ్మను పిలుచుకొని వస్తాను!" అని అంటూ లోపల ఉన్న వాళ్ళ అమ్మ దగ్గరికి పరిగెత్తుకుంటూ వెళ్ళాడు. "అమ్మా! అమ్మా! చూడు మనింటికి ఎవరొచ్చారో! మా చిన్నాన్నట. నాయనగారికి స్వయానా తమ్ముడట. బజారులో నన్ను చూచి ప్రేమతో పలకరించాడు. మనింటికి తీసుకొని వచ్చాను" అని చెప్పాడు. ముస్తఫా భార్య, ఇది విని నివ్వెరపోయింది.

"చిన్నాయనా! ఎవర్రా ఆయన? నీకెవరూ చిన్నాన్నలు, పెద్ద నాన్నలు లేరే!" అంటూ తలుపు తీసుకొని ఇవతలికి వచ్చింది.



చిన్నానా ! నీకెవరూ చిన్నాన్నలూ, పెదనాన్నలూలేరే అంటున్న అల్లావుద్దీన్ తల్లి

ముస్తఫా భార్యను చూచీ చూడగానే, మాంత్రికుడు, "సలామ్ వదిన గారూ! నేను మీ మరిదిని. మీరు నన్ను ఎరగరు. నేను చిన్నప్పుడే, మా అన్నగారికి పెళ్ళికాకముందే, దేశాలకు పెళ్ళిపోయాను. దేశ దేశాలు తిరిగాను.

ఏదో కాస్త సంపాదించాననుకో! మీకు నేను కొత్త కావచ్చు. కాని ఈ పిల్ల వాడిని చూడగానే, మా అన్నగారి పోలికలను బట్టి వీడు మా అన్న కొడుకే అయిఉంటాడని గుర్తించాను" అని అన్నాడు.

అంతా విని, "అలాగా! మరిదిగారూ! మీరు కూర్చోడానికి కుర్చీ కూడ లేదు. ఇలా ఈ చాపమీద కూర్చోండి" అంది ముస్తఫా భార్య చింకి చాప పరుస్తూ. "మీ అన్నగారు పోయిన తరువాత మా గతి మరీ అధ్వాన్న మైంది. ఆయన ఉండగా ఏదో దర్జీ పనిచేసి నాలుగు డబ్బులు సంపాదించి పెట్టే వాడు. ఇప్పుడు ఏ ఆధారమూలేదు. పైగా ఈ పిల్లవాడు అల్లాఉద్దీన్ ఒకడు. వీడ్ని నా కప్పగించి ఆయన కన్ను మూసారు. వీడికి ఊళ్ళో పిల్లలతో బలా దూరు తిరగడం తప్ప, వేరే పనీపాటు లేదు. పూట గడవడమే మాకు కష్టంగా ఉంది. అంతా ఆ అల్లా దయ!" అన్నది మళ్ళీ కన్నీరు కారుస్తూ.

"మీరేం విచారించకండి వదినగారూ! నేనంతా విన్నాను. పోయేటప్పు డయినా అన్నగారిని చూడలేక పోయాను. దౌర్భాగ్యుణ్ణి. ఇక నుంచి మీకేం దిగులులేదు. నేనున్నాను. అల్లా దయ ఉంటే పరిస్థితులన్నీ చక్కబెడతాను" అని ఎన్నోవిధాల ధైర్యం చెప్పాడు మాంత్రికుడు. కొంత ధనం కూడ ఆమె చేతిలో పెట్టాడు.

అమాయకురాలైన ముస్తఫా భార్య, మాంత్రికుడి మాటలన్నీ నమ్మింది. ఆ నాటి నుంచి మాంత్రికుడు వారిలో ఒక మనిషై పోయాడు. అల్లా ఉద్దీన్ బజారుకు తీసుకువెళ్ళి మిఠాయిలు, ఆడుకోవడానికి బొమ్మలు, ఎన్నో కొని పెట్టాడు. ఆ రాత్రి ముస్తఫా భార్య రకరకాల వంటకాలు చేసి, మాంత్రికుడికి తన కుమారుడికి కడుపునిండా భోజనం పెట్టింది. తాను కూడ హాయిగా తిని, అల్లాను తలుచుకుంటూ నిద్రపోయింది. భర్త చనిపోయిన తరువాత కడుపునిండా తిని, కంటినిండా నిద్రపోయింది ఆమె ఆ రోజే!



సంచిలోంచి ఉంగరాన్ని తీసియిచ్చిన మాంత్రికుడు

ఈ విధంగా నాలుగైదురోజులు హాయిగా గడిచిపోయాయి. ఇప్పుడు అల్లాఉద్దీన్ ముఖంలోకి ఎంతో కళ వచ్చింది. కడుపునిండా ఎప్పుడయితే తిండి పడుతుందో ఆప్పుడే మనిషి కూడా బాగుంటాడు. మాంత్రికుడు రోజూ ఆ కుర్ర వాడ్ని వెంటబెట్టుకొని మక్కానగరంలోని వీధులన్నీ తిప్పుతున్నాడు కావలసిన వన్నీ కొనిపెడుతున్నాడు. అంతకుముందు ఎప్పుడూచూడని రాజభవనాలు ఉద్యాన వనాలు చూస్తున్నాడు అల్లాఉద్దీన్.

ఒకనాడు మాంత్రికుడు, తన సంచిలోంచి ఒక ఉంగరం తీసి, అల్లా ఉద్దీన్ వేలికి పెట్టాడు. "ఒరే అబ్బాయీ! ఈ ఉంగరాన్ని ఎప్పుడూ తీయకు ఇది అన్ని వేళలా నీకు రక్షగా ఉంటుంది. అల్లాను ప్రార్థించుకుంటూ నీకిది ఇచ్చాను జ్ఞాపకం ఉంచుకో. ఎవరడిగినా ఇవ్వకు. ఎప్పుడూ తీయకు" అని చెప్పాడు మాంత్రికుడు అల్లాఉద్దీన్ చాలా సంతోషించి "అలాగే చిన్నాన్నా!" అంటూ మాంత్రికుడికి పదేపదే సలామ్ చేశాడు. రానురాను మాంత్రికుడిని వదలిపెట్టి వుండలేకపోతున్నాడు అల్లాఉద్దీన్. అతనిపై ఎంతో పూజ్యభావం ఏర్పడింది. అల్లాఉద్దీన్‌కి. ఆలాగే వాళ్ళ అమ్మకు కూడ మాంత్రికుడిపట్ల ఎంతో గౌరవం ఏర్పడింది స్వయానా అతను తనకు మరిదేనని పూర్తిగా నమ్మింది. జీవితాంతం తనకు, తన కుమారుడయిన అల్లాఉద్దీన్‌కు మరిది అండగా ఉంటాడు కదా అని ఆశపడింది.

రోజులు, వారాలు దొర్లిపోయాయి. తనపై అల్లాఉద్దీన్‌కు, వాళ్ళ అమ్మకు పూర్తి నమ్మకం ఏర్పడిందని మాంత్రికుడు గ్రహించాడు. ఇక ఏ ఆటంకమూ లేకుండా తన కార్యం సాధించుకోవచ్చునని నిశ్చయించుకున్నాడు.

అంతట ఒకనాడు మాంత్రికుడు., అల్లాఉద్దీనును వెంటబెట్టుకొని రోజుటిలాగానే నగరవీధులన్నీ తిప్పుతూ, వింతలు విశేషాలు చూపిస్తూ నగరం దాటి చాలా దూరం తీసుకువెళ్ళాడు. అక్కడ ఒక చిన్న కొండగుట్టఉంది. అల్లా ఉద్దీను ఎన్నడూ చూడని ప్రదేశం అది. అయినప్పటికీ తాను ఎంతగానో ప్రేమించే చినాన్న కనుక ఆయన చెప్పినట్లు చేయడం తన ధర్మం అని తలచి అల్లాఉద్దీన్ మరేమీ మాట్లాడకుండా మాంత్రికుడి వెంట వెల్లడం మొదలుపెట్టాడు. ఇద్దరూ

ఆ కొండగుట్టఎక్కి కొంతదూరం వెళ్ళారు. ఒక చోట చెట్లు, పొదలు దట్టంగా ఉన్న ప్రదేశంలో మాంత్రికుడు ఏవో మంత్రాలు చదివాడు. అప్పుడు హటాత్తుగా ఆ ప్రదేశంలో భూమి రెండుగా చీలి, ఒక బిలంలాగా ఏర్పడింది. ఆ బిలంలోకి దిగి ఇద్దరూ నడక సాగించారు. అల్లాఉద్దీన్‌కు అంతా వింతగా ఉంది. ఏం జరుగుతున్నదో ఏమీ తెలియలేదు. అయినప్పటికీ దేవుడులాంటి చినాన్న మీద నమ్మకంతో అతని వెనకాలే వెళ్ళాడు అల్లాఉద్దీన్. గుహలాగా చీకటిగా ఉన్న ఆ బిలంలో వెళుతుంటే మొదట అల్లాఉద్దీన్‌కు భయం పుట్టింది. కాని పక్కన చిన్నాన్న ఉన్నాడు కదా! అని నిబ్బరంగా నడక సాగించాడు అల్లాఉద్దీన్. అలా కొంతదూరం వెళ్ళగానే అక్కడ మెట్లు కనిపించాయి. బాగా వెలుతురు కూడా వచ్చింది. ఏదో వింత చూస్తున్నట్లు చూస్తున్నాడు అల్లాఉద్దీన్. అక్కడ రమణీయమైన ఒక ఉద్యానవనం కూడ కనిపించింది. అక్కడ వృక్షాలన్నీ కూడ అనేకరకాలైన తియ్యటి పండ్లు కాస్తున్నాయి. మాంత్రికుడు అవి కోసి అల్లాఉద్దీనుకు పెట్టాడు. ఎంతో రుచిగా ఉన్న ఆ పండ్లను తిని అల్లాఉద్దీను ఎంతగానో సంతుష్టి చెందాడు అలాంటి ఫలాలు ఆ కుర్రవాడు జన్మలో తిని ఎరుగడు. తరువాత ఒకచోట ధగధగ మెరిసే రత్నాలు, మణులు, రాశులు పోసి ఉన్నాయి. అల్లాఉద్దీను చాలా ఆశ్చర్యపడుతూ, కళ్ళు ఇంతింత చేసుకొని వాటి వంక అదే పనిగా చూడసాగాడు. అప్పుడు మాంత్రికుడు "ఇవి నీకు కావాలా?" అని అడుగుతూ రెండు గుప్పిట్ల నిండా ఆ రత్నాలు తీసి అల్లాఉద్దీను జేబుల్లో పోసాడు. అల్లాఉద్దీను ఒక పొడుగాటి అంగరకా వేసుకున్నాడు. మాంత్రికుడు కొని పెట్టినదే అది. దానికి రెండు పెద్దపెద్ద జేబులు ఉన్నాయి. జేబుల్లో పట్టినంతవరకు రత్నాలు పోసుకున్నాడు అల్లాఉద్దీను.

ఆ వుద్యానవనం మధ్యలో మరొక చిన్న సొరంగం కనిపించింది. అల్లావుద్దీనును అందులోకి దింపుతూ, మాంత్రికుడు "నీకేం భయంలేదు. నేనుచెప్పి నట్లు చేయ్ అల్లా నీకు మేలు చేస్తాడు" అని అన్నాడు.



మాంత్రికుడు వెలుపలే ఉండటం అల్లావుద్దీన్‌కి ఆశ్చర్యం కలిగించింది.

కాని, అల్లావుద్దీనుకు ఏదో అనుమానం కలిగింది. చీకటి కోనలావున్న ఆ బిలంలోకి తననొక్కడినే దింపి, మాంత్రికుడు తాను మాత్రం వెలుపలే వుండ

టం అతని సందేహానికి కారణమైంది. అంతేకాదు ఆ బిలంలో ఒక పాతలాంతరు వుంది. మరేమీలేదు. ఆ లాంతరును తన చేతికి అందివ్వమన్నాడు మాంత్రికుడు. దాంతో అల్లావుద్దీనుకు సందేహం మరీ ఎక్కువైంది. తనను బయటికి తీయకుండా ముందుగా లాంతరును అందివ్వమనడంలో అర్థం ఏమిటి? ఇందులో తప్పకుండా ఏదో మోసం వుంది. ఈ పాతలాంతరు ఎందుకు? దీనిలో ఏముంది? అని తనలో తాను తర్కించుకున్నాడు అల్లావుద్దీను. ఇప్పుడతను వెనుకటంతటి అమాయకుడు కాడు. లోకంలో అనేకమంది వింతమనుషులను, మోసగాళ్ళను చూసాడతను పైగా ఆ బిలం భరించరానంతటి దుర్గంధంతో కూడి వుంది. అల్లావుద్దీను లాంటి సన్నటి చిన్న కుర్రవాడు తప్ప పెద్దవాడెవ్వడూ పట్టడు. అందుకే మాంత్రికుడు ఆ కుర్రవాడ్ని ఆ బిలంలోకి దించాడు. ఇది గ్రహించిన అల్లావుద్దీను మాంత్రికుడు అడిగిన లాంతరు, అతనికి అందివ్వలేదు. అయినా మాంత్రికుడు ఎలాగయినా దాన్ని అందుకోవాలని వంగి ఎన్నో విధాల ప్రయత్నించాడు అంతేకాక ఆ లాంతరు తనకందివ్వమని అల్లావుద్దీనును బ్రతిమలాడాడు. ప్రాధేయపడ్డాడు. "మా నాయనకదూ! నీకు కావలసినంత డబ్బుయిస్తాను. మా తండ్రివి కదూ! నీ వడిగినన్ని మిటాయిలు కొనిపెడతాను నేను మీ చిన్నాన్ననురా! మీ అమ్మమీద ఒట్టు. నీవు నా మాట మన్నించి తీరాలి" అని పరిపరి విధాల మాంత్రికుడు వేడుకున్నాడు. కాని లాభం లేకపోయింది. ముందు తనను ఆ బిలంలోంచి బయటకు తీస్తేనే లాంతరు అతనికి అందిస్తానని అల్లావుద్దీను ఖండితంగా చెప్పేశాడు. అంతలో అతను జేబుల్లో పోసుకొన్న రత్నాలన్నీ మాయమైపోయినాయి. చూసుకొంటే జేబులు ఖాళీగా ఉన్నాయి. వెంటనే అతనికి తెలిసిపోయింది. ఇదంతా మాయ అని మాంత్రికుడు తనను నమ్మించి, మోసంచేయబోతున్నాడని కూడ

అల్లాఉద్దీన్ గ్రహించాడు. మాంత్రికుడు అడిగిన పాత దీపాన్ని తన జేబులో తురుముకున్నాడు.

ఎంత ప్రాధేయపడ్డా, ఏడ్చి మొత్తుకున్నా, తను సాధించాలనుకున్న లాంతరు చేతికి చిక్కకపోయేసరికి మాంత్రికుడికి ఎక్కడలేని కోపం వచ్చింది. అల్లాఉద్దీన్‌ను అక్కడే భూస్థాపితం చేయాలనుకున్నాడు అతను. తాను పొందాలను కున్న అద్భుతదీపం ఎలాగూ తనకు దక్కలేదు. అది అల్లాఉద్దీన్‌కు మాత్రం ఎందుకు దక్కాలి. అనుకొని మాంత్రికుడు, తక్షణమే ఏవో కొన్ని మంత్రాలు చదవగా ఆ బిలం మూసుకొని పోయింది. పిమ్మట మాంత్రికుడు పెద్ద బిలం నుంచి వెలుపలికివచ్చి, గుహలాగా ఉన్న ఆ బిలాన్ని కూడ మూసివేసి, ఎక్కడ లేని విచారంతో తన దారిన తాను వెళ్ళిపోయాడు.

సొరంగం పైన మూత పడటంతో అల్లాఉద్దీన్‌కు ఊపిరాడలేదు. ఆ చీకటి కోనలో దిక్కుతోచలేదు. ఇక ఇవాల్టితో తన పని అయిపోయినట్లేననీ, దిక్కూమొక్కూ లేకుండా ఈ అంధకారంలో, ఈ భూగర్భ సొరంగంలో తన ప్రాణాలు పోగొట్టుకోవలసినదేననీ, ఆ వచ్చినవాడు తన చిన్నాన్న కానేకాడనీ, ఒట్టి మోసగాడు, మహామాయావి అయిన మాంత్రికుడనీ నిశ్చయించుకొని అల్లా ఉద్దీన్ పరిపరివిధాల అల్లాను ప్రార్థించడం మొదలు పెట్టాడు. "ఓ భగవంతుడా! ఇక నీవే నాకు దిక్కు. నీవే రక్షకుడవు. ఆపదలో ఉన్న వారందరినీ కాపాడ తావే నీవు, దీనుడనైన నన్ను ఎందుకు కాపాడవు? మా అమ్మ నీకు నిత్యం నమాజు చేస్తూ ఉంటుందే దానికి ఫలితం ఇదేనా తండ్రీ? స్వామీ! ఎలాగైనా నన్ను కాపాడు" అని పరిపరి విధాల భగవంతుని ప్రార్థించాడు.

ఆ విధంగా అల్లాఉద్దీన్ ఆ భూగర్భ సొరంగంలో అన్నపానాదులు

లేక అలమటిస్తూ, ఆకలదప్పులతో బాధపడుతూ, వెక్కి వెక్కి ఏడుస్తూ మూడు రోజులు అలాగే ఉండిపోయాడు. ఇక అతనికి ప్రార్థన చేసే ఓపిక కూడ లేదు. ప్రాణాలు అన్నుబట్టాయి. నాలుక పిడచగట్టుకు పోయింది. సొమ్మసిల్లి పడి పోయాడు. నాలుగవరోజు పొద్దున్న కొంచెం అతనికి తెలివి వచ్చింది. కళ్ళు



ఆ ఉంగరాన్ని తన చేతిలో రుద్దుకున్నాడు.

తెరిచి చూచాడు. ఏముంది! అంతా మామూలే. కటిక చీకటి. ఊపిరి సలపలేదు. పిలిచేవారూ, తలిచేవారూ లేరు. అప్పుడు ఉన్నట్టుండి, మెరుపులాగ ఒక విషయం

అతనికి జ్ఞాపకం వచ్చింది. తన చిన్నాననని చెప్పుకొన్న ఆ మాయావి, తనకు రక్షగా ఉంటుందని, తన వేలికి పెట్టిన ఉంగరం సంగతి అల్లాఉద్దీన్‌కు జ్ఞాపకం వచ్చింది. ఆ ఉంగరాన్ని కళ్ళకద్దుకున్నాడు. దాన్ని ముద్దుపెట్టుకున్నాడు. "ఓ అల్లా! నీవే నన్ను కాపాడు" అని అంటూ, వేలికి పెట్టుకున్న ఆ వుంగరాన్ని తన చేతితో రుద్దుకున్నాడు. అప్పుడు వెంటనే ఒక భూతం అతని ముందు ప్రత్యక్షమైంది. మరుక్షణంలోనే ఆ చీకటి కోనలోకి వెలుగు వచ్చింది. భూతాన్ని చూచి అల్లాఉద్దీన్ కొంచెం భయపడ్డాడు. అయినా ధైర్యం తెచ్చుకొని "ఎవరు నీవు?" అని అడిగాడు. అప్పుడా భూతం "అయ్యా! నీవు వుంగరాన్ని రుద్దావు కదా! ఆ వుంగరం ప్రతినిధిని నేను. మీరు ఆజ్ఞాపిస్తే మీ పనులన్నీ చేసి పెట్టడానికి సిద్ధంగా వున్న సేవకుణ్ణి స్వామీ! సెలవీయండి. నన్నేం చేయమంటారు?" అని పలికింది.

వెంటనే అల్లాఉద్దీన్, "అయితే ముందు నన్నీ సొరంగం నుంచి బయట పడేయ్! నన్ను మా ఇంటి దగ్గర దిగబెట్టు!" అని అన్నాడు. అతనీ విధంగా అన్నాడో లేదో, మరుక్షణంలోనే ఆ భూతం మహిమవల్ల అల్లాఉద్దీన్ మళ్ళీ క్షేమంగాతన ఇంటి వద్దకు చేరుకున్నాడు. భూతం మాయమైపోయింది.

కానీ, నాలుగురోజుల బట్టి తిండితిప్పలు లేకుండా అల్లాడిన అల్లాఉద్దీన్ అలసి సొలసి, సొమ్మసిల్లి పడిపోయాడు. తల్లి అతన్ని చూచింది. అసలే నాలుగు రోజుల బట్టి తన కొడుకును చూడలేదు. తన మరిదితో కలిసి వెళ్ళిన వాడల్లా ఇప్పుడు ఒంటరిగా ఇంటికి వచ్చి, ఈ స్థితిలో ఉన్నాడే అని విచారపడుతూ, అతని ముఖాన నీళ్ళు చల్లి, ఎన్నో ఉపచారాలు చేసిందామె. అప్పుడు అల్లాఉద్దీను తెప్పరిల్లుకున్నాడు. అంతట అతని తల్లి "ఏమిరా! ఏమైంది నీకు? మీ చిన్నాన్న ఏడీ?" అని అడిగింది.

"వాడు మా చిన్నాన్న కాదూ! పాడూ కాదూ! ఒట్టి మోసగాడు. దొంగ, కపటి. వాడెవడో మాంత్రికుడు" అని చెప్పి, జరిగిన సంగతి యావత్తూ పూసగుచ్చినట్లు తల్లికి వివరించాడు అల్లాఉద్దీన్. అంతా విని ఆ ఇల్లాలు నిర్ఘాంత పోయింది. "అయ్యో! నాయనా! అసలే కష్టాలలో ఉన్న మనకు, భగవంతుడు ఈ ఆపద కూడ కొని తెచ్చాడా! సరేలే! ఏమైతేనేం ఎలాగో నీవు బతికి బయట పడ్డావు. అదే పదివేలు! అని అల్లాదయ" అని పలికి, ఆ తల్లి నాలుగురోజులుగా తిండి తిప్పలు లేకుండా ఉన్న కొడుక్కు. కొద్ది ధనంతో ఇంట్లో చేసిపెట్టిన పదార్థాలన్నీ కడుపునిండా తినబెట్టింది. అల్లాఉద్దీను అలా సుష్టుగా భోంచేసి, ఆ పైన నిద్రపోయాడు. ఆ విధంగా మూడు రోజులపాటు ఏకధాటిగా నిద్రపోతూనే ఉన్నాడు. నాలుగవరోజున కాని అతనికి మెలుకువ రాలేదు.

అల్లాఉద్దీను తాను జేబులో పెట్టుకొని భద్రంగా తెచ్చిన దీపం తల్లి కిచ్చి, దానిని దాచిపెట్టమన్నాడు. అటు పిమ్మట ఉన్న ధనంతో, ఎలాగో నాలుగురోజులపాటు ఇల్లు గడిపింది తల్లి. ఆపైన ఇంట్లో చిల్లి గవ్వలేదు. వంట చెయ్యడానికి ఒక్క సామాగ్రి కూడ లేదు.

ఇది ఇలా ఉండగా, మాంత్రికుడు ఇంకా ఆ నగరం నుంచి వెళ్ళి పోలేదు. తాను భూగర్భ సొరంగంలో పాతిపెట్టి వచ్చిన కుర్రవాడు అల్లా ఉద్దీను ఎలాగో ఒకలా బ్రతికి బయటపడి ఉంటాడని, తాను పొందాలనుకున్న అద్భుతదీపం అతని దగ్గరే ఉంటుందని తలచి, ఏ విధంగానైనా దాన్ని పొందాలని పన్నాగాలు పన్నుతూనే ఉన్నాడు.

ఇంట్లో వంటచేసుకోడానికి సామానులేమీ లేని సమయంలో పాత దీపాన్ని అమ్మివంటకు కావలసిన సామానులు కొంతయినా తీసుకొద్దామని అనుకొని

మరికొంచెం సేపట్లో వెండి, బంగారు పాత్రల్లో రకరకాల పిండివంటలు ఫలహారాలతో భూతం అక్కడ ప్రత్యక్షమై అన్నీ వారి ముందు పెట్టింది. అవన్నీ అవురావురుమంటూ తిన్నారు అల్లాఉద్దీను, అతని తల్లీను. ఆ లాంతరును అల్లాఉద్దీను ప్రేమతో ముద్దు పెట్టుకుని మరల దాన్ని తల్లికిచ్చాడు, భద్రంగా దాచి పెట్టమని. ఆనాటి నుంచీ వాళ్ళ కష్టాలు గట్టెక్కాయి. మాయాదీపం సహాయంతో అల్లాఉద్దీను కావలసినవన్నీ తెప్పించుకుని, అతను, అతని తల్లి సుఖంగా జీవిస్తున్నారు. అలాగే ఒక దివ్యభవనం నిర్మించుకున్నాడు అల్లాఉద్దీను ఆ మాయా దీపం సహాయంతో. భూతం అతను కోరినవన్నీ తక్షణమే సమకూర్చి పెడుతూ వచ్చింది. అలాంటి అందాల మందిరం ఆ నగరంలోనే లేదు. దాని నిండా బంగారు, వెండిపాత్రలే. ఎక్కడా దొరకని చిత్ర విచిత్రమైన అందమైన వస్తువులు ఆ సౌధంలో ఉన్నాయి. అంతేకాదు, అప్పటి వరకూ బికారిగా ఉన్న అల్లాఉద్దీను అప్పటి నుంచీ ఒక నవాబులాగా, అతి విలువైన దుస్తులు ధరిస్తూ రాకుమారుడిలాగా వెలిగిపోతున్నాడు. అతని తల్లి కూడా ఒక గొప్ప నవాబుకు మాతృమూర్తిగా వెలుగొందుతూ, వెల గల దుస్తులు ధరించి, మేలి ముసుగు కప్పుకుని తమకు పట్టిన అదృష్టాన్ని తలుచుకుని అమితంగా పొంగిపోతూ వచ్చింది.

ఇలా రోజులు గడిచిపోయాయి. నగరంలో జనమంతా అల్లావుద్దీనుకు ఇంతటి ఐశ్వర్యం ఎలా వచ్చిందా? అని ఆశ్చర్య పోతున్నారు. ఇలా వుండగా ఒకనాడు ఆ దేశాన్ని పాలించే సుల్తాను నగర సందర్శనానికై వచ్చాడు. అతనితో పాటు అతని ఏకైక కుమార్తె కూడా వచ్చింది. ఆ అమ్మాయి చాలా చక్కనిది

ఆమెను తన సౌధంలో నుంచి చూడడం తటస్థించింది అల్లావుద్దీనుకు. తొలిచూపు లోనే సుల్తాను కూతురు, అతని మనస్సును దోచుకున్నది. ఆ అమ్మాయి అంటే ఎంతో మోజు పడ్డాడు అల్లావుద్దీను. ఆమెను తన భార్యగా చేసుకోవడం ఎలాగా అని దీర్ఘంగా ఆలోచించసాగాడు.

కుమారుడు పరధ్యానంగా ఉండడం కనిపెట్టి తల్లి అతన్ని కారణం చెప్పమని పదేపదే అడిగింది. మొదట్లో అల్లావుద్దీను ఏమీ చెప్పలేదు. కాని చివరకు తల్లి బలవంతంమీద, విషయం దాచిపెట్టి ఇక లాభంలేదని తాను సుల్తాను కుమార్తెపై మనసు పడినట్లు, ఆమెను పెళ్ళాడాలని నిశ్చయించుకున్నట్లు ఆమెకు వెల్లడించాడు. అతని అభిప్రాయం తెలుసుకుని ఆ తల్లి మొదట ఎంతగానో సందేహించింది. "ఇది అసంభవం నాయనా! సుల్తాను ఎక్కడ? ఆయన అందాల కూతురు ఎక్కడ? ఏదో కొద్దిపాటి భాగ్యం ఈనాటికి సంపాదించుకున్న మనం ఎక్కడ? నీ కోరిక నెరవేరడం కష్టం. నా మాట విని నీ అభిప్రాయం మార్చుకో తండ్రీ!" అని ఎన్నో విధాల చెప్పింది తల్లి. అయినా అల్లావుద్దీను అంగీకరించలేదు. తాను పట్టినపట్టు విడవలేదు. "అమ్మా! నా కోసం నీవు ఎలాగైనా సుల్తాను దగ్గరికి వెళ్ళు. అయన కుమార్తెను నాకిచ్చి పెళ్ళి చేయమని ప్రాధేయపడు. ఎలాగైనా నాకీ ఉపకారం చేసిపెట్టమ్మా!" అని అన్నాడు.

ఎంతైనా కన్న ప్రేమకదా! ఆ తల్లి కొడుకు మాట కాదనలేక పోయింది. ఒకరోజు మంచి దుస్తులు ధరించి, అనేకరకాల కానుకలను తీసుకుని సుల్తాను భవనానికి వెళ్ళింది. ఎలాగో చాలా కష్టంమీద, లోపలకి వెళ్ళడానికి ఆమెకు అనుమతి లభించింది. చివరకు ఆమె, సుల్తానును సందర్శించి ఆయనకు

అనేక 'సలాములు' చేసి, తాను తెచ్చిన కానుకలను సమర్పించింది. పిమ్మట వినయ విధేయతలతో తాను వచ్చిన పనిని గురించి తెలియజేసింది. సుల్తాను ఆమె చెప్పినదంతా విన్నాడు. అల్లావుద్దీను గురించి ఒక సామాన్యమైన దర్జీకి కుమారుడయినప్పటికీ ఈనాడు అదృష్టవశాన నగరంలోని గొప్పధనవంతులలో ఒకడయినాడని విని వుండడంచేత అంతగా ఆశ్చర్యపడలేదు. కాని ఒకషరతు పెట్టాడు.



నా కుమార్తెను పెళ్ళాడ గోరేవాడు ప్రపంచంలోకెల్లా విలువైన రెండు వజ్రాలు తెచ్చియివ్వాలంటున్న రాజు

"నా కుమార్తె అందాలరాశి, అపరంజిబొమ్మ. ఆమెను పెళ్ళాడదలచుకున్నవాడు ప్రపంచంలోకెల్లా విలువయిన వజ్రాలు రెండు తెచ్చి, నాకు కానుకగాసమర్పించాలి. అలాంటి శక్తి సామర్థ్యాలు, తాహతునీ కుమారుడికి ఉన్నాయేమో ఆలోచించుకో మను. నా కోరిక తీర్చడానికి నీ కుమారుడు ఇష్టపడి నా కోరికను తీరిస్తే నా కుమార్తెను అతనికిచ్చి తప్పక పెళ్ళి చేస్తాను" అని చెప్పాడు సుల్తాను.

అది వినగానే అల్లావుద్దీను తల్లి నీరుకారిపోయింది. ఇక తన కొడుకు కోరిక తీరడం అసాధ్యమని అనుకుని, సుల్తాను దగ్గర సెలవు పుచ్చుకుని తిరిగి తన ఇల్లు చేరుకున్నది. తల్లి రాకకోసం ఎదురు చూస్తున్న అల్లావుద్దీను అమ్మను చూడగానే ఎదురువెళ్ళి ఆమెను కౌగలించుకున్నాడు. "ఏమైందమ్మా? కాయా పండా? నాకు తెలుసు. నీవు వెడితే ఆపని కాకుండా ఉంటుందా?" అని ఆనందంతో ప్రశ్నల వర్షం కురిపించాడు. తల్లి ఏమీ సమాధానం చెప్పకుండా బిక్కముఖం వేసింది. అది కనిపెట్టి అల్లావుద్దీను, "ఏం జరిగిందమ్మా? జరిగిందేమిటో చెప్పు సుల్తాను! కాదన్నాడా?" అని గుచ్చి గుచ్చి అడిగాడు.

అప్పుడు తల్లి ఉన్న విషయం బయటపెట్టింది. "సుల్తాను కోరే గొంతెమ్మ కోర్కెలు మనమేం తీర్చగలం నాయనా? ప్రపంచంలోకెల్లా విలువైన వజ్రాలు రెండు కానుకగా ఇవ్వాలట! అప్పుడు గాని పిల్ల నివ్వరట! అలాంటి ఆ వజ్రాలు ఈజిప్టురాజు వద్ద ఉన్నట్లు విన్నాను, నేను" అని తల్లి వివరించి చెప్పింది.

అల్లావుద్దీను కొంచెంసేపు ఆలోచించాడు, తలగోక్కుంటూ తరువాత

తల్లితో, "మరేం ఫరవాలేదు. తెస్తాను! అలాంటి రెండు వజ్రాలు తెచ్చి, సుల్తాను కూతురుని పెళ్ళాడతాను" అని పలికి, ఆ మాయాదీపం తీసుకురమ్మన్నాడు. తల్లి తెచ్చి ఇచ్చింది. దాన్ని తన రెండు చేతులతో గట్టిగా రుద్దాడు. అల్లావుద్దీను. వెంటనే మహాభూతం ప్రత్యక్షమైంది. "ప్రభూ ఏమిటి సెలవు?" అని అడిగింది. తన కోరిక చెప్పాడు అల్లావుద్దీను. "చిత్తం అలాగే! ఈజిప్టు మహారాజు వద్ద ఉన్న ఆ రెండు విలువైన వజ్రాలు తెచ్చిస్తాను నీకు" అని అన్నది భూతం.

ఆ ప్రకారంగానే భూతం తెచ్చి ఇవ్వడంవల్ల, అతి విలువైన ఆరెండు వజ్రాలు అల్లావుద్దీను వశమైనాయి. తల్లి చాలా సంతోషించి, వాటిని భద్రంగా తీసుకొని వెళ్ళి సుల్తానుకు సమర్పించింది. అతని ఆనందానికి అంతులేదు. అల్లావుద్దీను తెలివితేటలు, సామర్థ్యాన్ని ఎంతగానో మెచ్చుకున్నాడు. వెంటనే సుల్తాను కుమార్తె పెళ్ళికి అన్ని ఏర్పాట్లు జరిగిపోయాయి. అల్లావుద్దీను పెళ్ళి సుల్తాను కుమార్తెతో రంగరంగ వైభవంగా జరిగింది. దేశంలో ఉన్న పెద్ద పెద్ద సుల్తానులు, నవాబులు ఆ పెళ్ళికి విచ్చేశారు. అందరికీ బ్రహ్మాండమైన విందు జరిగింది అందమైన భార్య లభించినందుకు అల్లావుద్దీను మురిసిపోయాడు. అలాగే తన మనసుకు నచ్చిన భర్త దొరికినందుకు సుల్తాను కుమార్తె కూడ చాలా సంతోషించింది. ఇక అల్లావుద్దీను తల్లి సంగతి చెప్పనే అక్కరలేదు. ఆమె ఆనందానికి పట్టపగ్గాలు లేకుండా పోయింది.

ఈ విధంగా అల్లావుద్దీను తన తల్లితోను, భార్యతోను దివ్యభవనంలో నివశిస్తూ, సమస్త భోగభాగ్యాలతో తులతూగుతూ ఉన్నాడు. కాలం గడిచిపోయింది.



అల్లాఉద్దీన్ తల్లితోను, భార్యతోను దివ్యభవనంలో నివశించుట.

అయితే, మాంత్రికుడు పన్నాగాలు పన్నుతూ, ఇంకా ఆ నగరంలోనే వున్నాడు. తాను చూస్తూవుండగానే అల్లావుద్దీను ఇలా గొప్పవాడు కావడం, ప్రజ అంతా అతనిగురించే చెప్పుకోవడం విన్నాడతను. ఇదంతా ఆ అద్భుత దీపం మహిమేనని తెలుసుకున్నాడు. అది అల్లావుద్దీను దగ్గరనే వున్నదని గ్రహించాడు. ఎలాగయినా మోసంచేసి దాన్ని కాజేయాలని నిశ్చయించుకున్నాడు.

వెంటనే ఉపాయం ఆలోచించాడు. తననెవ్వరూ గుర్తుపట్టకుండా మారువేషం వేసుకొని "పాతదీపాలుతీసుకుని కొత్తదీపాలు ఇస్తారోహో!" అని కేకపెడుతూ వీధివీధి తిరగసాగాడు. అలా తిరుగుతూ, తిరుగుతూ అల్లావుద్దీను భవనంవద్దకు వచ్చాడు. ఆ కేకవిన్నది అల్లావుద్దీను భార్య. అద్భుతదీపం వల్లనే అల్లావుద్దీనుకు ఈ ఐశ్వర్యం పట్టిందని ఆమెకు తెలియదు. ఇంట్లో ఒక మూల పడివున్న తుప్పుపట్టిన ఆ పాత దీపం ఎందుకని చెప్పి దాన్ని మాంత్రికుడికి ఇచ్చివేసి కొత్తదీపాన్ని తీసుకుంది. ఆ దీపాన్ని చూడగానే మాంత్రికుడి కళ్ళు ఎంతో వెలిగిపోయాయి. దాన్ని పదే పదే ముద్దుపెట్టుకున్నాడు. "ఇక అల్లావుద్దీన్ పని ఖాళీ!" అని అనుకుంటూ దీపాన్ని పట్టుకుని తన చేతులతో రుద్దాడు. తక్షణమే మహాభూతం అతనిముందు ప్రత్యక్షమైంది. "ప్రభూ! ఏమిటి ఆజ్ఞ?" అని అడిగింది.

వెంటనే మాంత్రికుడు "ఓయీ! అల్లావుద్దీన్‌కు పట్టిన సకలైశ్వర్యాలు నశించిపోవాలి అదే నాకు కావలసింది" అని అన్నాడు.

ఆ మరుక్షణంలో అల్లావుద్దీన్ ఉండే భవనం, అతని దాస దాసీ జనం సమస్త భోగభాగ్యాలు మాయమైపోయాయి. అల్లావుద్దీన్ ఒక భికారి లాగా, తన మామూలు గుడిసెలో ఉన్నాడు. తల్లి కూడ చినిగిన బట్టలు కట్టుకుని, దీనావస్థలో ఉందక్కడ. సుల్తాను కుమార్తెకు ఇదేమీ అర్థంకాక, బిత్తర చూపులు చూస్తూ, సాధారణ ముస్లిమ్ స్త్రీలాగ వారి దగ్గర ఉండిపోయింది. "తన కోర్కె నెరవేరిందికదా!" అని పగలబడి నవ్వుకున్నాడు, మాంత్రికుడు.

ఈ విధంగా ఎందుకు జరిగిందో తరువాత తెలిసింది అల్లావుద్దీన్‌కు. మాంత్రికుడు మోసం చేసి, అద్భుతదీపాన్ని కాజేసాడనీ, తన భార్య తెలియక ఆ మాయాదీపాన్ని మాంత్రికుడికి అమ్మివేసిందనీ తెలుసుకున్నాడు. తన దుర దృష్టానికి ఎంతగానో విచారించాడు. తల్లికూడ నెత్తి నోరు కొట్టుకొని ఎన్నో విధాల వాపోయింది. జరిగిన మోసం సుల్తాన్ కుమార్తె కూడ తెలుసుకున్నది. కాని, ఏం లాభం? జరగవలసినదంతా జరిగిపోయింది. ఇందుకు గాను ఎవరినను కొని ఏం లాభం?

అల్లావుద్దీన్ బికారైనాడన్న వార్త నగరమంతావ్యాపించింది. ఆ మరు క్షణంలోనే సుల్తానుకు కూడ తెలిసిపోయింది. అతని ఆగ్రహానికి అంతులేదు. తక్షణమే రాజభటులను పంపించి, తన కుమార్తెను ఇంటికి రప్పించాడు. తనను ఇలా మోసగించి నందుకు, ద్రోహానికి పాల్పడినందుకు అల్లావుద్దీన్‌కు మరణశిక్ష విధించాడు సుల్తాను "ఇదంతా మాంత్రికుడు మాయ అనీ, మోసమనీ, అల్లా వుద్దీన్, అతని తల్లి ఎంత మొత్తుకున్నా, సుల్తాను వారి మాటలను చెవిన పెట్ట లేదు. ఆఖరుకు సుల్తాను కుమార్తె కూడ, అల్లావుద్దీన్ అంటే తనకెంతో ఇష్ట మనీ, దివ్య మహిమగల దీపాన్ని తెలియక తాను అమ్మివేయడం వల్లనే ఈ దుస్థితి సంభవించిందనీ ఎంతగానో చెప్పింది. కాని, సుల్తాను వినిపించుకోలేదు.

అల్లావుద్దీన్‌కు మరణశిక్ష ఖాయమైపోయింది. తల్లి దు:ఖానికి అంతు లేదు. అల్లావుద్దీన్ చాలా దీనుడయి దిగులుపడుతూ కూర్చున్నాడు. ఏం చేయడానికీ అతనికి తోచలేదు. అసలు జరిగిన సంగతి, ఎవరికి తెలుస్తుంది.? ఎలా తెలుస్తుంది



తనను మోసగించిన అల్లాఉద్దీన్‌కు మరణదండన విధిస్తున్న రాజు.

ఏ క్షణంలోనయినా రాజభటులు అతన్ని పట్టుకుని, వధ్యశాలకు తీసుకుపో వచ్చు.

అల్లాను ఎన్నో విధాల ప్రార్థించుకున్నాడు, అల్లావుద్దీన్. ఈ లోగా మాంత్రికుడు, అద్భుతదీపం సహాయంతో ధన కనక వస్తువాహనాదులు సంపాదించి, సుల్తానును మెప్పించి, అతని కుమార్తెను వశం చేసుకున్నాడు. అయితే

సుల్తాను కుమార్తెకు అతనిపై ఇష్టంలేదు. ఆమె అల్లావుద్దీన్‌నే కోరుకున్నది. మాంత్రికుడు వచ్చి, రోజూ అనేక మాయమాటలు చెప్పి ఆమెను బలవంతం చేస్తున్నాడు. అయినప్పటికీ, ఆమె లొంగలేదు.

"దిక్కులేనివారికి దేవుడే దిక్కన్నట్లు" ఆపదలో ఉన్న వారిని అల్లా తప్పకుండా ఆదుకుంటాడు. ఉన్నట్టుండి, అల్లావుద్దీను మనసులోకి ఒక ఆలోచన మెరుపులా వచ్చింది. మాంత్రికుడు, తనచేతికి తొడిగిన ఉంగరం సంగతి గుర్తుకు వచ్చింది. వెంటనే ఆ వుంగరాన్ని చూచుకొని దాన్ని తన చేతులతో రుద్దాడు. వెంటనే చిన్న భూతం అతని ముందుకు వచ్చింది. మాంత్రికుడు ఎత్తుకొనిపోయిన మాయాదీపాన్ని తీసుకొని రమ్మని భూతాన్ని కోరాడు, అల్లావుద్దీను.

కానీ భూతం, ఆ పని చేయడం తనకు సాధ్యం కాదన్నది. "స్వామీ ఈ పని చేయడం నావల్లకాదు. ఎందుకంటే ఆ అద్భుతదీపంను ఆవహించిఉన్నది ఒక మహాభూతం. నాకన్నా ఎంతో పెద్దది. నాకంటే ఎన్నోరెట్లు మహిమకలది." అని వాస్తవం చెప్పింది.

"అయితే, భూతమా! ఈ స్థితిలో నేనేం చేయాలి? నీవే ఏదో ఒక ఉపాయం చెప్పు. నీవుతప్ప నాకింకెవరూ తోడులేరు" అని పలుకుతూ అల్లావుద్దీను భూతాన్ని ఎన్నో విధాల ప్రార్థించాడు. అప్పుడాభూతం, "బాబూ! అయితే నేను నీకొక ఉపాయం చెబుతాను. మాంత్రికుడు ఆ మాయాదీపాన్ని నీ భార్యనువుంచిన భవనం దగ్గరికి నిన్ను చేరుస్తాను. నేను చేయగలిగిందల్లా అంతే!" అని చెప్పి ఆ మరుక్షణంలోనే అల్లావుద్దీనును ఆ భవనం దగ్గరికి చేర్చి మాయమైపోయింది.

ఆ సౌధం దగ్గరే అల్లావుద్దీను పిచ్చివాడిలాగా, అటూ ఇటూ తిరుగుతూ వుండగా, మేడలోనుంచి అతని భార్య చూసింది. చాలా సంతోషించి లోపలికి పిలిచింది. అల్లావుద్దీను, భార్యను ఆనందంతో కౌగలించుకున్నాడు. పిమ్మట సంగతి సందర్భాలన్నీ ఆమె అతనికి చెప్పింది. రోజూ మాంత్రికుడు వచ్చి నిర్బంధిస్తున్నాడని కూడ తెలియజేసింది. ఆలోచించారు. "ఆ మరునాడు మాంత్రి



మాంత్రికుడు ఎప్పటిలాగా అల్లాఉద్దీన్ భార్యను పెళ్ళాడమని అడగటం; ఒప్పుకొన్నట్లు నటించడం.

కుడు వచ్చి" ఎప్పటిలాగే తనను పెళ్ళాడమని నిర్బంధిస్తే అందుకు సుముఖంగా ఉన్నట్లు నటించి, అతనిని నమ్మింపజేయమన్నాడు. సుల్తాను కుమార్తెను వాడికి బాగా మద్యం తాగించి, వాడా మత్తులో ఉండగా మెల్లగా ఆ మాయాదీపాన్ని కాజేసి, తనకివ్వమని ఉపాయం చెప్పాడు, అల్లావుద్దీను. సరేనన్నది సుల్తాను కుమార్తె.

ఆ మరుసటి రోజు రోజుటిలాగే మాంత్రికుడు సుల్తాను కుమార్తె దగ్గరకు వచ్చి ఆమెను నిర్బంధించసాగాడు. అప్పుడు సుల్తాను కుమార్తె లేనిపోని కపటప్రేమను నటిస్తూ అతనిముందు నాట్యం చేసింది. "ఒక్క వారంరోజులు గడువిస్తే తరువాత అతని వశమైపోతానని" నమ్మేటట్లు చెప్పింది. తరువాత అతనికి కావలసినంత మేలురకం మద్యం పోసి అతనికి మత్తెక్కించింది. అంతట ఆ మాంత్రికుడికి బాగా కైపెక్కి, ఊగుతూ, తూగుతూ, ఆ తరుణిమణి మాటలు నమ్మి పడిపోయాడు.

అలాంటి తరుణం కోసమే కనిపెట్టుకొని ఉన్నాడు. అల్లావుద్దీను అప్పుడు. సుల్తాను కుమార్తె మాయాదీపాన్ని తెచ్చి అల్లావుద్దీనుకు అప్పగించింది అంతట ఒక ఏకాంత ప్రదేశానికి వచ్చి అల్లావుద్దీను, "అంతా ఆ అల్లా దయ!" అని అనుకుంటూ దీపాన్ని చేత్తో రుద్దాడు. తక్షణమే ఆ మహాభూతం ప్రత్యక్ష మైంది. అల్లావుద్దీన్ దాన్ని చూసి, "ఓ భూతరాజమా! నేను పోగొట్టుకున్న దివ్య భవనం, దాస దాసీ జనం సకల భోగభాగ్యాలతో సహా నా భార్యను నా కప్పగించు

దీనావస్థలో ఉన్న నా తల్లిని కూడ క్షేమంగా ఇక్కడికి చేర్చు. నాకు మరణ దండన విధించిన సుల్తాన్‌కు కనువిప్పు కలిగించి, ఎప్పటిలాగానే అతని దగ్గర అమూల్య వజ్రాలు వుండేటట్లు చేయి. అదే నేను నిన్నుకోరేది" అని అన్నాడు.

మరొక నిమిషంలో అల్లావుద్దీన్ ఎప్పటిలాగా సుఖ భోగభాగ్యాలతో తులతూగసాగాడు. సుల్తాన్ కుమార్తె కూడ మంచిదుస్తులు ధరించి అతనిదగ్గరికి చేరింది. తల్లిసైతం వాడిన తీగ, తిరిగి చిగురించినట్లుగా ఎక్కడలేని ఆనందంతో అలా ముందు కూర్చుని, ప్రార్థన చేసుకుంటూ వుంది.

తరువాత అల్లాఉద్దీన్ మహాభూతాన్ని పిలిచి, "ఓ భూతరాజా! నీకు భగవంతుడు అద్భుతశక్తులు ప్రసాదించాడు. అవి లోకానికి మేలుచేయడానికి కాని, ప్రజలకు హాని చేయడానికి కాదు. ఈ దుష్ట మాంత్రికుడి లాంటివాడి చేతుల్లో ఉంటే, వాడు తప్పకుండా ప్రజలకు అనర్థాలే కలిగిస్తాడు కాబట్టి నీవు తక్షణం వెళ్ళి ఆ మాంత్రికుడిని అతని అనుచరులను సంహరించి రా!" అని ఆజ్ఞాపించాడు.

పిమ్మట ఆ మహాభూతం వికటాట్టహాసం చేస్తూ, మాంత్రికుడున్న స్థలానికి చేరుకుని, పెద్ద కరవాలంతో వాడిశిరస్సును ఖండించి వేసింది. అలాగే నగరంలో రకరకాల వేషాలు వేసుకుని, చిత్ర విచిత్ర మాయలు చేస్తున్న వందలాది మంది మాంత్రికుడి అనుచరులనుకూడ మట్టుపెట్టి, అల్లాఉద్దీన్ వద్దకు తిరిగి



మహాభూతానికి విముక్తి కలిగించటం.

వచ్చింది. అలా తన కార్యం పూర్తి చేసుకొని వచ్చిన భూతంతో అల్లాఉద్దీన్ "ఓ భూతరాజా! ఇక నీకు విముక్తి ప్రసాదిస్తున్నాను. నీ ఇష్టమైన చోటికి వెళ్ళిపోయి స్వేచ్ఛగా వుండు" అని చెప్పాడు.

అంతట ఆ మహాభూతం సంతోషంతో "చాలా సంతోషం! ఇన్నాళ్ళకు నాకీ బందిఖానానుంచి విముక్తి కలిగించావు. అల్లా నీకెప్పుడూ మేలుచేస్తాడు!"

అని దీవించి, మాయమైపోయింది. అంతవరకూ మాయలతో ఉన్న దీపం మామూలు దీపంగా మిగిలిపోయింది.

ఆ తరువాత సుల్తాన్ తన కుమార్తెద్వారా, ఇతరుల ద్వారా సంగతులన్నీ విన్నాడు. స్వయంగా అల్లాఉద్దీన్‌ను చూడడానికి వచ్చాడు. అల్లాఉద్దీన్, తన కుమార్తెతో సకలైశ్వర్యాలతో తులతూగుతూ వుండడాన్ని చూచాడు. సుల్తాన్ "నాయనా! అల్లాఉద్దీన్! ఇదంతా ఆ మాంత్రికుడు చేసిన మోసం. నేను నిన్ను అపార్థం చేసుకున్నాను. నా కుమారుడి లాంటి నీకు మరణదండన విధించి, తీరని అపచారం చేసాను నాయనా! నన్ను క్షమించు" అని ఎన్నోవిధాల వేడుకున్నాడు.

అందుకు అల్లాఉద్దీన్ ఎంతో వినయంగా "తప్పు! తప్పు! మీరు పెద్ద వారు. ఈ దేశానికి ప్రభువులు. ఇందులో మీ దోషమేమీ లేదు. మనకు కష్టంగాని, సుఖంగాని కలుగుతుందీ అంటే అదంతా ఆ అల్లా లీలే కాని మరొకటికాదు. అందువల్ల మీరేమాత్రం విచారించకండి. అమూల్య వజ్రాలు రెండు యిప్పుడు మీ ఖజానాలోకి చేరి వుంటాయి. చూచుకోండి" అని పలికి సుల్తాన్‌కు నమస్కారించాడు.

సుల్తాన్ మహదానందంతో అల్లాఉద్దీన్‌ను, తన కుమార్తెను దీవించి వెళ్ళిపోయాడు. సుల్తాన్ అనంతరం అల్లాఉద్దీన్, సుల్తాన్ అయ్యాడు. అతడు

ధర్మంగా పరిపాలన సాగిస్తూ, అందరి మన్ననలు అందుకుంటూ తన భార్యతో సుఖంగా వున్నాడు. అప్పటినుంచీ ఆ ప్రాంతంలోకి మరే మాంత్రికుడు అడుగు పెట్టలేదు. ఏ మాయలు, మంత్రాలతో జనాన్ని మోసం చేయనూలేదు!



అల్లాఉద్దీన్ సుల్తాన్ అవ్వడం. భార్యతో సుఖంగా వుండటం

# మంత్రి దుర్బోధలు విని చెడిపోయిన మహారాజు!

పార్శిక దేశంలో జూమాన్ అనే భూభాగం ఒకటి వుండేది. దాన్ని ఒక రాజు పరిపాలిస్తున్నాడు. అతనికి అన్ని ఐశ్వర్యాలు వున్నాయి. ఏ విధంగానూ కొరతలేదు. కాని ఎంతో కాలంగా ఆ రాజు కుష్ఠురోగంతో బాధపడుతున్నాడు. ఎందరో ఘన వైద్యులు దేశదేశాలనుంచి వచ్చి రాజుగారికి చికిత్సలు చేశారు. కాని, రోగం తగ్గకపోగా రోజురోజుకు వ్యాధి ముదురుతూ వచ్చింది. శరీరమంతా పుండు పడింది. తన ముఖం చూచుకోడానికే అసహ్యమనిపిస్తూ వచ్చింది రాజుకు. సభ తీర్చడం, రాజోద్యోగుల నందర్శి చూడడం మానేశాడు. ఎవరికి కనిపించాలన్నా అతనికి సిగ్గుగాను, అవమానకరంగానూ వుండేది. అందుచేత బహిరంగంగా కనిపించడం మానేశాడు రాజు. నానాటికీ అతనికి దిగులెక్కువయింది. తీరని మనోవ్యథతో బాధపడుతూ వచ్చాడు.

ఎందరు వైద్యులు వచ్చి ఎన్నిరకాల చికిత్సలు చేసినప్పటికీ యెవరూ అతని కుష్టువ్యాధిని కుదర్చలేక పోయారు. చివరికా రాజు ఆశ వదులుకొని ఇక తనకు మరణం తప్ప గత్యంతరం లేదని అనుకుంటూ వున్న సమయంలో వృద్ధుడయిన ఒక వైద్యుడు పరాయి దేశంనుంచి అక్కడకు రావడం తటస్థించింది. ఆ

వైద్యుడు మామూలు వైద్యుడుకాడు. పర్షియా, అరేబియా, టర్కీ, గ్రీకు, లాటిన్, సిరియన్, హిబ్రూ మొదలయిన అనేక భాషల్లో వ్రాయబడిన ప్రసిద్ధ వైద్య గ్రంధాలు పఠించి, ఔషధుల తత్వాన్ని బాగా గ్రహించి, అనేక రహస్యాలు తెలుసుకున్న వైద్య శిఖామణి. అతనిపేరు డూబాన్. మహారాజు ఎంతో కాలంగా కుష్టువ్యాధితో బాధపడుతున్నాడని, ఎందరెందరో ఘనవైద్యులు వైద్యం చేశారని, కాని ఎవరివల్లాకూడా వ్యాధి కుదరలేదని డూబాన్‌కు తెలిసింది. అతను రాజును సందర్శించి "ప్రభూ! మీకేమందులూ, ఒంటికి పూసుకునే లేపనాలు అక్కర్లేదు. నాకు అనుమతిస్తే కొద్దిరోజుల్లోనే మీ వ్యాధి నేను కుదురుస్తాను." అని చెప్పాడు.

అది విని రాజు నిరాశగా తనలోతాను నవ్వుకొని "ఓ భిషగ్వరా! నన్ను మన్నించండి. ప్రపంచంలో వున్న పేరుమోసిన వైద్యులంతా నాకు చికిత్స చేశారు. కాని లాభం లేకపోయింది. నేను అన్నిటిమీద ఆశ వదులుకున్నాను. మన్నించండి." అని తన నిరాశ నిస్పృహలను వ్యక్తంచేశాడు. అప్పుడు డూబాన్ "అలాకాదు మహారాజా! నామాట వినండి! ఈ పరిస్థితులలో మీరు నిరాశ చెందడం సహజమే. ఈ ఒక్కసారి నన్నుకూడా ప్రయత్నించనివ్వండి. అన్నిటికీ ఆ సర్వేశ్వరుడే వున్నాడు." అని ఎన్నోవిధాల రాజుకు

నచ్చచెప్పగా చివరకు అతనిచేత చికిత్స చేయించుకోడానికి మహారాజు సమ్మతించాడు.



దూబాన్‌కు అన్నివసతులు కల్పించిన రాజు

డూబాన్ ఉండడానికి అన్ని వసతులూ రాజు కల్పించాడు. అంతట డూబాన్ ఏవేవో మూలికలు తెచ్చి చూర్ణాలు చేశాడు. బంతి ఆట ఆడుకోడానికి వీలయిన ఒక కర్రను తయారు చేయించాడు. లోపలంతా డొల్లగా ఉండేటట్లు చేసి మొదట్లో మాత్రం చేతితో పట్టుకోడానికి వీలుగా తయారు చేయించాడు. అలాగే ఒక కొయ్య బంతిని కూడా లోపల అంతా డొల్లగా ఉండేటట్లు తయారు చేయించి ఆ కర్రలోను, ఆ బంతిలోను వివిధ మూలికలతో తాను తయారుచేసిన చూర్ణాన్ని పోయించాడు. పిమ్మట కర్రకు, బంతికీ మూత వేయించి వాటికి సన్నటి బెజ్జాలు పొడిపించాడు.

పిమ్మట మహారాజు దగ్గరకు వెళ్ళి "మహారాజా! ఔషధం తయారయింది. రేపటినుంచే చికిత్స ప్రారంభిస్తాం. మీరు చేయవలసిన 'పని ప్రతి రోజూ గుర్రంపై ఎక్కి స్వారీచేస్తూ వ్యాయామ స్థలానికి వెళ్ళాలి. అక్కడ ఈ బంతిని కర్రతో కొడుతూ మీ శరీరం యావత్తూ బాగా చెమటలు కారేంత వరకూ ఆ విధంగా ఆడాలి. ఈ రకంగా ఒక వారం రోజులు చెయ్యండి. అదే మీకు వైద్యం!" అని చెప్పి తాను తయారు చేయించిన కర్ర, బంతి రాజుకు అప్పగించాడు.

మనస్సులో పెద్ద నమ్మకం లేకపోయినప్పటికీ ప్రాణాలమీద ఉండే

ఆశతో రాజు సరేనని తల ఊపి, వైద్యుడు చెప్పిన విధంగానే మరుసటి రోజున గుర్రంపై బయలుదేరి వ్యాయామ స్థలానికి వెళ్ళాడు. డూబాన్ ఇచ్చిన బంతిని కర్రతో కొడుతూ అనేక గంటలసేపు ఆడాడు. అతని ఒడలంతా చెమటలు కారి పోయ్యాయి. ఆ విధంగా వారంరోజులపాటు చేసేటప్పటికి బంతిలో డూబాన్ ఇమిడ్చిన వనమూలికల చూర్ణం కరిగిపోయి దాని సారమంతా రాజు చేతికి అంటు కున్నది. ఆ విధంగా అతని శరీరంలో ప్రవేశించి వ్యాధి మానిపోయేటట్లు చేసింది. వారం రోజులలో రాజు కుష్ఠురోగం యావత్తు పూర్తిగా తగ్గిపోయి అతను మామూలు మనిషి అయ్యాడు. ఇప్పుడతని దేహంమీద ఎక్కడా పుండు లేదు. మచ్చకూడా లేదు. పైగా అతని దేహానికి ఎక్కడలేని కాంతి వచ్చింది. నరనరాలకు, కండరాలకు బలం చేకూరింది. రాజు ఆనందానికి అవధుల్లేవు. ప్రపంచంలో ఏ వైద్యుడికీ సాధ్యంకాని ఈ మహా వ్యాధిని డూబాన్ సునా యాసంగా తనకేమాత్రం శ్రమ కలగకుండా, ఏ లేపనాలు, అంగమర్దనలు లేకుండానే కుదిర్చాడని అతనికి ఎక్కడలేని ఆశ్చర్యం కలిగింది.

రాజు సభ తీర్చాడు. తన రాజోద్యోగులందరూ చూస్తూ ఉండగా, వైద్యుడు డూబాన్‌ను అక్కడకు పిలిపించాడు. "ఓ భిషగ్రత్నమా! నీ కిదే వేయి నమస్కారాలు! అద్భుతమైన నీ వైద్యంతో నన్ను మామూలు మనిషిని

చేసి నాకు ప్రాణదానం కావించావు. ఇందుకు ప్రతిఫలంగా నీకెన్ని ధనద్రవ్యాలిచ్చినా నీ ఋణం తీర్చుకోలేదు. అయినప్పటికీ నా శక్త్యానుసారం ఉడతా భక్తిగా నీకీ కానుకలు సమర్పిస్తున్నాను. దయతో స్వీకరించండి." అని పలికి డూబాన్‌ను ఉన్నతాసనంపై కూర్చుండబెట్టి వెలలేని రత్నాలు, బంగారు నాణాలు రాశిగాపోసి అమూల్యమైన వస్త్రాభరణాలతో అతన్ని గౌరవిస్తూ. అతని పాదాలంటి నమస్కరించాడు రాజు. సభాసదులంతా ఆ దృశ్యాన్ని చూచి పులకించి పోయారు. "ఓ వైద్యశిఖామణీ! నాకు తోచిన చిరుకానుకలు మీకు సమర్పించాను. ఇకనుంచీ మీరు ఇక్కడే ఉండండి. మీ నివాసానికిగాను ప్రత్యేకంగా ఒక దివ్య సౌధాన్ని ఏర్పాటు చేస్తున్నాను. అనేక సేవకులు మీకు నిత్యం సేవలు చేస్తూ వుంటారు. రోజూ వెయ్యి బంగారు నాణాల చొప్పున మీ ఖర్చులకుగాను మా రాజోద్యోగులు మీకు ముట్టచెబుతూ వుంటారు." అని పలికి తన మంత్రిని చూచి తగిన ఉత్తర్వులు జారీ చేశాడు రాజు.

"ఓ ప్రజ్ఞాశాలీ! నేనేదో మిమ్మల్ని గొప్పచేశానని మీరనుకోకండి. మీరు నాకు ప్రాణదాతలు! మీరేకనుక అలా చేయనట్లయితే నేనీవిధంగా పూర్ణ ఆరోగ్యవంతుడనై ఈ మహారాజ భోగాలు అనుభవించలేను కదా! కాబట్టి మీరు చేసిన మేలుకు ప్రత్యుపకారంగా ఏంచేసినా సరిపోదు." అని విన్నవించాడు రాజు.

మహారాజు మాటలువిని సభలో ఉన్న అనేకమంది పెద్దలు ఎంతగానో మెచ్చుకున్నారు. 'నిజానికి అతను చేసిన మేలుకుగాను మహారాజు కావించిన గౌరవం ఏమంత గొప్పది కాదు.' అన్నారు కొందరు. 'భయంకరమైన కుష్టు



ఎప్పటిలాగా మహారాజును ఆరోగ్యవంతుణ్ణి చేసినందుకు ధనరాసులు, కానుకలు ఇచ్చినరాజు.

రోగంతో కృంగిపోతున్న మహారాజును ఎప్పటిలా ఆరోగ్యవంతుణ్ని చేసి రక్షించి నందుకు ఆ వైద్యోత్తముడికి ఏమిచ్చినా సరిపోదు!' అని అన్నారు చాలామంది. మొత్తంమీద అందరూ డూబాన్‌ను ఎన్నోవిధాల పొగిడారు. 'అతను సాక్షాత్తు ఆ సర్వేశ్వరుడు పంపిన ధన్వంతరే!' అని అనుకున్నారు అంతా.

అయితే ఇలాంటి ధనద్రవ్యాలు, గౌరవ సత్కారాలు ముక్కు, మొఖం తెలియని పరాయి దేశస్థుడైన వైద్యుడు పొందడం చూచి అసూయ పడినవారు కూడా లేకపోలేదు. అది సహజం. డబ్బు, పదవి, కీర్తి ఎంతటి వారికయినా ఈర్ష్య పుట్టిస్తాయి. అది లోకరీతి. ముఖ్యంగా రాజు దగ్గర ఉండే ప్రధానా మాత్యుడు అందరికంటే ఎక్కువగా అసూయపడటం మొదలుపెట్టాడు. అసూయ అనేది మహాచెడ్డది. అది మనస్సులో మొలకెత్తకుండా ఉండాలేకాని, ఒకసారి మొలకెత్తితే అది విషవృక్షంలాగా అంతకంతకూ పెరిగి పెద్దదై ద్వేషం పాతు కొనిపోయి ఒక మహావృక్షంలాగా తయారవుతుంది. అప్పుడు దాన్ని నరికివేయ డం ఎవరివల్లాకాదు. మంత్రి మహారాజు చెవిదగ్గర చేరి, వైద్యుడు డూబాన్‌పట్ల తనకుగల అసూయను, ద్వేషభావాన్ని అదేపనిగా వెళ్ళగక్కుతూ వచ్చాడు. "మహారాజా! మీరేమైనా అనుకోండి ఆ వైద్యుడు మీకు అసాధ్యమైన రోగాన్ని కుదిర్చినమాట నిజమే. అయితే అంతమాత్రం చేత అతనికి మన ధనాగారం

నుంచి రోజూ ఇంత ధనం పంపించడం, ఎవరికీ పొందశక్యంకాని గౌరవమర్యాదలు అతనికి లభింపజేయడం నాకు నచ్చలేదు. మీ హితవుకోరే వాణ్ని గనుక మీకు చెపుతున్నాను. ఈ డూబాన్ ఎక్కడో పరాయి దేశంనుంచి వచ్చినవాడు. మనకు ముక్కూ, ముఖం తెలియని అపరిచితుడు. అలాంటివాడితో మీరింత చనువుగా స్వేచ్ఛగా మెలగడం మంచిదికాదు. నాకతనిపై ఏదో అనుమానం కలుగుతున్నది. మీ శత్రువులెవరో దురాలోచన చేసి ఉపాయంగా ఇతణ్ని మీ దగ్గరకు పంపించారేమోనని నా అనుమానం. మొదట నమ్మకం కలగడానికి ఏదో మేలు చేసినట్లు నటించాడు. అలా ఉండి ఉండి ఎప్పుడో ఉపాయంగా మీ ప్రాణాలు తీస్తాడు. ఇందులో సందేహంలేదు." అని చెప్పాడు.

మంత్రి మాటలు వినగానే రాజుకు మొదట ఎక్కడలేని ఆగ్రహం కలిగింది. "మంత్రివర్యా! ఏమిటీ పిచ్చి మాటలు? నాకు ద్రోహం తలపెట్టడానికి వచ్చిన వాడైతే, మహా వ్యాధితో చావుకు సిద్ధమై ఉన్న నన్ను ఎందుకు బ్రతికిస్తాడు? మీ మాటలు నేనెంత మాత్రం విశ్వసించను." అని తిరస్కరించారు.

కాని మంత్రి వైఖరి మారలేదు. అతను అదేపనిగా డూబాన్‌పై లేనిపోని ఆరోపణలు చేస్తూ రాజు మనస్సులో విషబీజాలు నాటుతూ వచ్చాడు. 'తినగ తినగ వేము తియ్యనుండు' అను సామెతగా, క్రమేణా మంత్రి విషపు

మాటలు రాజుకు తలకెక్కాయి. డూబాన్‌పై అతనికి అనుమానం ఏర్పడింది. నాటినుంచీ అకారణంగా ఆ వైద్యోత్తముడిపై పగను పెంచుకొని, రోజూ అతనికి పంపే ధనద్రవ్యాలు ఆపుచేయించాడు. అతని భోజనానికి సరిపోయేటట్లు నెలకు వేయి బంగారు నాణాలు మాత్రమే పంపుతూ వచ్చాడు.

డూబాన్ అనేకసార్లు రాజును సందర్శించి 'తనపట్ల ఆగ్రహం ఎందుకు కలిగిందో, తాను చేసిన నేరం ఏమిటో చెప్పమని' అడిగాడు. కాని రాజు సమాధానం చెప్పలేదు. రోజులు, వారాలు, నెలలు గడిచిపోయాయి. రాజు తనను నిరాదరణ చేయడానికి కారణం ఏమిటో ఎంత ఆలోచించినా డూబాన్‌కు బోధపడలేదు. చివరకు నిత్యం రాజు ప్రక్కన ఉండే ప్రధానామాత్యుడు మొదలయినవారు తనపై ఏవో లేనిపోని నిందారోపణలు చేసి ఆయనకు దుర్బోధలు చేస్తూ రాజు మనస్సును పెడమార్గం పట్టించారని గ్రహించుకున్నాడు. 'అవును! ప్రభువుల ఆగ్రహానుగ్రహాలకు కారణాలుండవు! ఎందుకు వారికి ఎక్కడలేని అభిమానం కలుగుతుందో మరు క్షణంలో ఎందుకు కోపం వస్తుందో తెలియదు.' అపారమయినన జ్ఞాన సంపదగల వైద్యోత్తముడు డూబాన్‌కు ఈ విషయం తెలియకపోలేదు. అతను ఆ భగవంతుణ్ణి ప్రార్థిస్తూ కాలం గడపసాగాడు. అంతట రాజు క్రమేణా అతనికి దినబత్యం పంపడంకూడా మానివేశాడు. దాంతో ఎవరూ పొందని గౌరవ సన్మానాలు పొందిన

డూబాన్ చివరకు కడుపునిండా తిండికూడా నోచుకోక దుస్థితిని అనుభవించవలసి వచ్చింది. అయినా అప్పటికీ మంత్రి ఏ క్షణంలోనో డూబాన్‌వల్ల ముప్పు ముంచుకొస్తుందని ఎప్పటికప్పుడు రాజును హెచ్చరిస్తూనే ఉన్నాడు.

"మహామంత్రీ! నీవెన్ని చెప్పినా నాకెందుకో డూబాన్ అంటే మనస్సులో అభిమానం కలుగుతూనే ఉంది. నాకు ప్రాణదానం చేసినవాడికి నేను ప్రత్యుపకారం చెయ్యకపోగా ఇలాంటి దుస్థితిలో పడవేశాను. ప్రాణం కంటే విలువయినది ఈ లోకంలో మరేదీ లేదుకదా!" అని అన్నాడు రాజు.

"నిజమే మహారాజా! మీరు చెప్పింది సత్యమే! కాని నేను దూరం లోచించాను. ఎవరో మనశత్రువులు ఇతణ్ని మీపై ప్రయోగించారు. ఇందులో ఎంత మాత్రం సందేహం లేదు. డూబాన్ అభ్యున్నతిని చూచి ఈర్ష్యతో నేనీ మాట చెప్పడంలేదు. ఈ వైద్యుడు అఖండ మేధావి. ప్రపంచ భాషలన్నీ తెలిసిన పండితుడు, వైద్య శాస్త్రంలో సాటిలేని నిపుణుడు. ఇలాంటివాడు మిమ్మల్ని ఏ క్షణంలోనయినా మూలికా సహాయంతో మీ ప్రాణాలు తియ్యవచ్చు. కాబట్టి తక్షణం ఇతని పీడ వదిలించుకోవడం ఉత్తమం. వెంటనే ఆలసించక డూబాన్‌కు మరణ దండన విధించండి!" అని అన్నాడు మంత్రి.

రాజు ఆలోచించాడు. మంత్రి చెప్పింది నిజమేనని తోచిందతనికి. తక్షణం భటులను పంపించి డూబాన్‌ను పిలిపించాడు. అతనికి మరణదండన విధిస్తున్నట్లుగా ప్రకటించాడు. నిరపరాధి అయిన వైద్యుడు ఆ మాట విని నిలువునా నీరై పోయాడు. కొంత సేపటివరకూ అతని నోట మాటరాలేదు. మూర్ఛ వచ్చినంత పనైందతనికి. తర్వాత మెల్లగా ఎలాగో తెప్పరిల్లుకొని "ఏమిటి ప్రభూ మీరనేది! మిమ్మల్ని పూర్ణ ఆరోగ్యవంతుణ్ణి చేసి మీ ప్రాణాలు కాపాడినందుకు మీరిచ్చే ప్రతిఫలమా ఇది! నేను చేసిన నేరం ఏమిటి? నా తప్పేమిటి? చెప్పండి ప్రభూ! నేను నిజంగా నేరస్థుణ్ని అయితే, దానికి విచారణ జరిపి, న్యాయంగా మీరే శిక్ష విధిస్తే నేను దాన్ని సంతోషంగా స్వీకరిస్తాను" అని ప్రార్థించాడు డూబాన్.

రాజు అతని మాటలు వినిపించుకోలేదు. "నీకు నేను కారణం చెప్పాల్సిన అవసరంలేదు. మరణశిక్ష తక్షణం అనుభవించ వలసిందేనీవు. కారణాలు, న్యాయ విచారణలు, నాకు అక్కరలేదు. ఇదే నా ఆజ్ఞ! దీనికి తిరుగులేదు." అని రాజు ఖండితంగా పలికాడు.

రాజు ఇలా అన్యాయంగా, తనకు మహోపకారం చేసిన వైద్యుడికి మరణశిక్ష విధించడం సభాసదులందరికీ ఆశ్చర్యం కలిగించింది. "ఇదేమి న్యాయం?



రాజు దూబాన్‌కి మరణశిక్ష విధించడం అందరికీ ఆశ్చర్యాన్ని కలిగించింది.

ఇదెక్కడి తీర్పు?" అని అంతా ముక్కుమీద వేలేసుకున్నారు. ఒక్క ప్రధానామాత్యుడుతప్ప! అకారణంగా దూబాన్‌కు మరణదండన విధించినందుకు రాజోద్యోగులతో సహా పౌరులంతా విచారంలో మునిగిపోయారు. ఎన్నో విధాల దూబాన్ వేడుకున్నప్పటికీ, కఠినాత్ముడయిన ఆ రాజు మనస్సు కరగలేదు. ఇక తనకు

చావు తప్పదని గ్రహించి డూబాన్ "అయితే మహాప్రభూ! నాదొక చిన్న కోరిక. ఒకసారి నా స్వస్థలానికి వెళ్ళి నా భార్య, బిడ్డలను కళ్ళారా చూచుకొని వస్తాను. నా అనంతరం జరుగవలసిన అంత్యక్రియలు మొదలైన అన్ని ఏర్పాట్లు చేసుకొని వస్తాను. కనీసం ఇందుకైనా అనుమతించండి." అని రెండు చేతులూ యెత్తి ప్రార్థించాడు.

వైద్యుడి కోరికను మన్నించి రాజు అతణ్ణి భటులకు అప్పగించి, కట్టు దిట్టమైన ఏర్పాట్లతో జాగ్రత్తగా అతణ్ని స్వస్థలానికి తీసుకొని వెళ్ళి మళ్ళీ తీసుకొని రమ్మని ఆజ్ఞాపించాడు.

ఆ ప్రకారంగానే డూబాన్, రాజభటుల రక్షణలో తన దేశానికి వెళ్ళి భార్యా బిడ్డలను చూచి రోదిస్తూ విషయమంతా వారికి వివరించి రాజాజ్ఞ ఉల్లం ఘించరానిదని, తన చావు తప్పదని తెలియజేశాడు. తన తర్వాత జరుగవలసిన ఏర్పాట్లన్నీ భార్యా బిడ్డలకు నివేదించాడు. ఎన్నో ఏండ్లుగా తాను సేకరించి ఉంచిన వివిధ భాషలలోని పురాతన వైద్య గ్రంథాలన్నీ ఒక మూటగట్టి తనతో పాటు తీసుకొని రాజభటుల వెంట మరల రాజు సమక్షానికి వచ్చాడు. అప్పుడు నగరమంతా కోలాహలంగా ఉంది.

డూబాన్‌కు మరణదండన అమలుపరిచే రోజున ఎక్కడెక్కడి జనం

ఆ వింత చూడడానికి నగరానికి తరలి వచ్చారు. రాజు ఎదుట మోకరిల్లి డూబాన్, తాను తెచ్చిన మూటవిప్పి ప్రాచీన వైద్యగ్రంథాలన్నీ రాజుగారిముందు పెట్టాడు. "మహాప్రభో! మరణశిక్ష అనుభవించేవాణ్ణి ఆఖరికోర్కె ఏమిటని అందరూ అడుగుతారు. అయితే అడగడానికి నాకే కోరికాలేదు. కాని ఒక్కటే నా మనవి, ఇవన్నీ వైద్యగ్రంథాలు. చాలా పురాతనమైనవి. తెలిసిన పండితులు వీటిని చదివి రకరకాల వ్యాధులకు చికిత్సలు చేసుకోవచ్చు. అంతేకాదు మహారాజా! వీటిల్లో అతి ప్రాచీనమైన తాళపత్ర గ్రంథం ఒకటి ఉంది. అందులోని విషయాలు ప్రపంచంలో మరెక్కడాలేవు. చాలా అమూల్యమైన గ్రంథం అది. మీరా గ్రంథాన్ని మీవద్ద భద్రంగా అట్టిపెట్టి ఉంచుకోండి లోకానికి మేలుచేసిన వారవు తారు. అంతేకాదు ప్రభూ! తలారి నాతల నరికేటప్పుడు అది వెళ్ళి పళ్ళెరంలో పడేటట్లు నాముందు ఒక పళ్ళెరం ఉంచండి. ప్రాణంలేని ఆ శిరస్సు ప్రాణంతో ఉన్న మనిషిలాగా మీతో మాట్లాడుతుంది. మీరెలాంటి ప్రశ్నలడిగినా అన్నిటికీ సమాధానాలు చెపుతుంది. మరొక ముఖ్యమైన విషయం మహారాజా! ఆ తాటాకుల పుస్తకంలో ఎనిమిదవ పుటలో ఎనిమిదవ పంక్తి చదవమని నా ప్రార్థన! అది చదివితే మీకు అద్భుతమైన విషయం తెలుస్తుంది." అని పలికి డూబాన్ సర్వే శ్వరుడైన ఆ అల్లాను ప్రార్థించుకోవడం మొదలుపెట్టాడు.

ఏమిటీ చిత్రం? వృద్ధవైద్యుడు డూబాన్ ఇలా నిబ్బరంగా మాట్లాడడ

మేమిటి? ప్రాచీన వైద్య గ్రంథాలన్నీ రాజుకు అప్పగించడమేమిటి? అతి పురాతనమైన ఆ తాళపత్ర గ్రంథం ఏమిటి? దానిలోని ఎనిమిదవ పుటలో, ఎనిమిదవ పంక్తిలో ఏం వ్రాసి ఉన్నది? అంతా ఎంతో వింతగా ఉన్నదే! అని ప్రజలందరూ వేయి కళ్ళతో ఎదురుచూస్తూ ఉన్నారు.

మరణశిక్ష విధించడానికి ఏర్పాట్లన్నీ పూర్తి అయ్యాయి. డూబాన్ కోరినట్లుగానే తలారి అతని తల తెగవేసినప్పుడు అది పళ్ళెంలో పడేటట్లుగా అతని ముందు ఒక పళ్ళెరం ఏర్పాటు చేయడం జరిగింది. రాజు సింహాసనంపై కూర్చొని ఉన్నాడు. పౌరులంతా సంభ్రమాశ్చర్యాలతోను, అలాగే విషణ్ణ వదనాలతోను ఏం జరుగుతుందోనని కనులు ఇంతింత చేసుకొని చూస్తూ వున్నారు. రాజుకుకూడా డూబాన్ చెప్పిన మాటలు ఎంతో కుతూహలం కలిగించాయి. తాళపత్ర గ్రంథంలో ఉన్న విచిత్రం ఏమిటో తెలుసుకోవాలన్న ఆసక్తి, ఆరాటం అతనికి అంతకంతకూ అధికమవుతూ వచ్చింది. ఆ తాటాకుల పుస్తకం చేత పట్టుకున్నాడు. వెంటనే తలారి తన ఖడ్గంతో ఒక్కవేటు వేసి డూబాన్ శిరస్సును ఖండించి వేశాడు. ముందుగా ఏర్పాటు చేసినట్లుగానే తెగిన ఆ తల వెళ్ళి ముందున్న పళ్ళెరంలో పడింది. వెంటనే అది ప్రాణం వున్న మనిషిలాగా కళ్ళుతెరిచి చూచి మాట్లాడడం మొదలు పెట్టింది. "తాళపత్ర గ్రంథం విప్పి

చూడండి మహారాజా! అందులో ఉన్న విషయం ఏదో చదివి గ్రహించండి." అని అన్నది మొండెంలేని ఆ శిరస్సు.

జనమంతా ఆశ్చర్యపోతున్నారు. తెగిపడిన తలకు ప్రాణమెలా వచ్చిందా అని, ఎలా మాట్లాడుతున్నదా అని నిర్ఘాంతపోయారు. శిరస్సు చెప్పినట్లుగానే తాళపత్ర గ్రంథం చేతబట్టుకొని పుటలు తిరగేయడం మొదలు పెట్టాడు రాజు. కాని అవి ఒకదానికొకటి అతుక్కొని ఉండడంవల్ల ఎంతకూ రాలేదు. అప్పుడు రాజు వేలు నోట్లో పెట్టుకొని ఉమ్మితో తడిచేస్తూ, తాటాకులను తిరగ వేయడం మొదలుపెట్టాడు. ఆ విధంగా ప్రతిసారి నోట్లో వేలు పెట్టుకొని ఉమ్మితో తడిచేస్తూ తాళపత్రాలు జాగ్రత్తగా తిరగవేయసాగాడు. అయితే ఏ పుటలోనూ అతనికి ఎలాంటి అక్షరాలు కనిపించలేదు. అంతట ఆ రాజు మతిపోయినట్లుండి ఎనిమిదవ పుటవరకు వచ్చాడు. అందులోనూ ఏమీ అక్షరాలు లేవు. అలాంటప్పుడు ఇక ఎనిమిదవ పంక్తి ఎక్కడుంటుంది?

విషయమేమిటీ అంటే - ఆ తాళపత్ర గ్రంథం అంతా విషంపూసి ఉంది. అందులో ఏ అక్షరాలు లేవు, పాడులేవు. దట్టంగా కాలకూట విషం పూసి ఉన్నందువల్ల తాటాకులన్నీ ఒకదానొకటి అతుక్కొని ఉన్నాయి. ఆ కారణం వల్లనే రాజు వెంటనే వాటిని తిరగేయలేక పోయాడు. ప్రతిసారి తన

వేలు నోట్లో పెట్టుకొని ఉమ్మితో తడిచేస్తూ తాళపత్రాలు తిరగేస్తూ ఉన్నందువల్ల క్రమేణా విషం రాజు శరీరం లోపలికివెళ్ళి అతనికళ్ళు తిరగడం మొదలుపెట్టాయి. తను ప్రాణాలు కోల్పోనున్నట్లు రాజు గ్రహించాడు.



మళ్ళీ అతనితో "చూచారా మహారాజా ఉపకారం చేసినవారికి అపకారం చేసిన ఫలితం ఇది" అంటున్న తెగిన

అంతట డూబాన్ శిరస్సు మళ్ళీ అతనితో "మహారాజా! చూచారా! మహోపకారం చేసిన వ్యక్తికి అకారణంగా మరణదండన విధించిన ఫలితం ఇది! ఆ భగవంతుడు ఎవరికి ఎప్పుడూ అన్యాయం చేయడయ్యా! 'చేసుకున్న వారికి చేసుకున్నంత!' ఎవడుచేసిన పాపానికి తగిన శిక్ష వాడే అనుభవించేటట్లు చేస్తాడు ఆ అల్లా! తమరు తెలుసుకోవలసిన సత్యం ఇదే! అపకారికైనా ఉపకారమే చెయ్యాలిగాని ఉపకారికి అపకారం చెయ్యడం గొప్పకాదు. ఇదే ఆ భగవంతుడు చెప్పే నీతి!" అని పలికి డూబాన్ శిరస్సు మాట్లాడడం మానివేసింది. అప్పుడే దుర్మార్గుడైన ఆ రాజుకూడా విషం పూర్తిగా తలకెక్కి ప్రాణాలు వదిలి పెట్టాడు.



# రాగిపాత్రలో రాక్షసుడు

పూర్వకాలమందు ఒక గ్రామంలో ఒక జాలరి ఉన్నాడు. అతను చాలా పేదవాడు. రోజూ దగ్గరలో వున్న సముద్రానికి వెళ్ళి చేపలు పట్టుకుని దాంతో జీవించసాగాడు. కాని ఎన్ని ఏండ్లు గడిచినా అతనికి పొట్ట నిండడమే కష్టమైపోతుంది. నిత్యం ఆ భగవంతుణ్ని ఎన్నోవిధాల ప్రార్థించేవాడు తనను భాగ్యవంతుణ్ని చేయమని. అయినా దేవుడు అతనిమొర ఆలకించలేదు. అతని దుర్భర దారిద్ర్య బాధలు తప్పలేదు.

ఇలా వుండగా ఒకరోజు జాలరి మామూలుగా వల, మున్నగునవి తీసుకుని సముద్రం దగ్గరికి వెళ్ళాడు. భగవంతుణ్ని ధ్యానిస్తూ వల విసిరాడు. కాని ఒక్క చేపకూడా పడలేదు. అలా ఎన్నోసార్లు వలవేసాడు. కాని ప్రతిసారి అంతే. గంటలు గడిచిపోతున్నాయి. సాయంకాలం దాకా జాలరి అలావల విసురుతూ, తన దౌర్భాగ్యంతో పోరాడుతూనే ఉన్నాడు. అతని చేతులు నొప్పులు పుట్టాయి. విసుగు వచ్చింది. "భగవంతుడా ఏమిటి నాకీ పరీక్ష. ధన ద్రవ్యాలు ఎలాగూ నాకు ప్రాప్తంలేదు. నా దరిద్రం ఇంతే అనుకున్నాను. కాని మామూలుగా లభించే కొద్దిపాటి చేపలుకూడా ఇంతవరకు నా వలలో పడలేదే! నేను సంపాదించేదెలా? నాకీ రోజు గడిచేది ఎలాగ?" అని అన్నివిధాల ఆ పేద జాలరి విచారించసాగాడు.

ఆ విధంగా ఎక్కడలేని నిరాశా, నిస్పృహలతో క్రుంగిపోయి జాలరి, దీనంగా దిగులుగా విసరలేక, విసరలేక వలవిసరగా, అప్పుడు అతని వల చాల బరువుగా తగిలింది. జాలరి ఆశతో వల బయటకు తీశాడు. ఆశ్చర్యం! చేప లకు బదులుగా, ఒక పెద్ద రాగిపాత్ర ఆ వలలోకి రావడం అతనికి కనిపించింది. ఆ పాత్రనిండా ధనం ఉండవచ్చు. లేదా రత్నాలతో నిండివుండవచ్చు. నాఅదృష్టం



ఆ పాత్రనిండా ధనం వుండవచ్చని ఆశతో ఆలోచించుకుంటున్న జాలరి

ఎలావుందో! అని ఆలోచించుకుంటూ ఎంతో ఆశతో ఉన్న దాని మూత దీయ డానికి ప్రయత్నించాడు. అయితే పాత్ర మూత ఒక పట్టాన రాలేదు. గట్టిగా బిగించి ఉంది. అప్పుడు జాలరి తన మొలలోని కత్తి తీసి పాత్ర మూతనుకోసి వేశాడు.

ఆ జాలరి మూతతీయగానే పాత్రలోపల్నుంచి పొగ వచ్చింది. అది అంతకంతకూ పెద్దదై, సముద్రతీరమంతా వ్యాపించింది. జాలరికి ఏమీ తోచ లేదు. అలాగే చూస్తూ కొంచెంసేపు నిలుచున్నాడు. అప్పుడు ఒక బ్రహ్మాండ మయిన రాక్షసుడు ఆ పొగలోనుంచి బయటకు వచ్చి జాలరిముందు నిలబడ్డాడు. జాలరి భయంతో గజగజ వణికిపోయాడు. దూరంగా వెళ్ళి నిలుచున్నాడు. పారి పోవాలని అనుకున్నాడు కాని అమితభయంవల్ల అతను ఒక్క అడుగు కూడా ముందుకు వేయలేకపోయాడు.

సముద్రంలో ఉండే రకరకాల భయానకమయిన జంతువులను చూచిన వాడు కావడంవల్ల జాలరి కొంచెంసేపటికి తెప్పరిల్లుకున్నాడు. ధైర్యం తెచ్చుకుని నిలబడ్డాడు. అప్పుడా రాక్షసుడు "సాలోమన్! ఓ మహనీయదేవతా! నన్ను క్షమించు. నీ ఆజ్ఞకు భిన్నంగా నేను ఎప్పుడూ ప్రవర్తించను స్వామీ!" అని బిగ్గరగా ప్రార్థన చేశాడు అది వినిజాలరి "ఓ రాక్షసరాజా! నీకోరిక ఏమిటి? మహనీయుడైన సాలోమన్ గతించి ఇప్పటి పద్దెనిమిది వందల సంవత్సరాలైంది

అసలు నీవీ రాగిపాత్రలో ఎలా బంధించబడ్డావు? నీ చరిత్ర యావత్తూ నాకు చెప్పు" అని అన్నాడు.

"నా చరిత్రతో నీకెందుకు? నీవు నన్ను గౌరవించాలి. లేకపోతే నిన్నిప్పుడే చంపేస్తాను" అని బెదిరించాడు రాక్షసుడు.

జాలరి ఏ మాత్రం భయపడకుండా "నిన్ను ఈబంధిఖానా నుంచి విముక్తి చేశాను నీకు ఉపకారం చేసిన వాడ్ని చంపుతావా?" అని అడిగాడు.

"అవును. అదినాకు జ్ఞాపకం వుంది. కాని ఆ ఉపకారం నీ ప్రాణాలను కాపాడలేదు. నిన్ను అందరిలా చంపను. ఏ రీతిగా చంపమంటావో కోరుకో. నీవు కోరుకున్నట్లే నీ చావు సంభవిస్తుంది." అన్నాడు రాక్షసుడు.

"ఉపకారం చేసినందుకు ఇదా ఫలితం?" అని అడిగాడు.

"ఏం చేయమంటావు. దయచూపడం నాకు అలవాటులేదు. నా చరిత్ర వింటే ఆ విషయం నీకే తెలుస్తుంది" అనిపలికి రాక్షసుడు తన కథ చెప్ప సాగాడు.

"నేను సర్వేశ్వరుడ్ని ధిక్కరించే పాపాత్ముణ్ణి. తక్కిన రాక్షసులంతా సాలోమన్ అధికారానికి లోబడి ప్రవర్తించి వచ్చారు. నేను మాత్రం అలా చేయక ఆయన ఆజ్ఞ ధిక్కరిస్తూ వచ్చాను. సాగిర్ అనే మరో రాక్షసుడు



మొదటి వందసంవత్సరాలలో నన్ను బంధవిముక్తి చేసినవారిని
అమిత భాగ్యవంతునిగా చేస్తాను.

కూడా నాలాగే సాలోమన్‌ని ఎదిరించాడు. అప్పుడా చక్రవర్తి నాపై పగబూని తన మంత్రులద్వారా నన్ను తన అదుపులో పెట్టుకోడానికి చాలా విధాల ప్రయత్నించాడు. ఎంతచేసినా దావూదు కుమారుడైన ఆ సాలోమన్ చక్రవర్తికి నేనులొంగలేదు. అప్పుడాయన ఆగ్రహించి ఈ రాగిపాత్రలో నన్ను బందీగాచేశాడు.

పాత్రపైన సీసపు మూత బిగించాడు. సర్వేశ్వరుడి పేరుతో వున్న రాజముద్రి కను దానిపై ముద్రించి నన్ను ఈ సముద్రంలో పారేయించాడు. మొదటి వంద సంవత్సరాలలో నన్ను ఎవరు బంధవిముక్తి చేస్తారో వారిని అమిత భాగ్య వంతులుగా చేస్తానని, అలాగే వారి కుటుంబంలోని వారి నందరిని ధనవంతులుగా చేస్తానని నేను మాట ఇచ్చాను. కాని ఎవరూ నన్ను బంధవిముక్తుణ్ణి చేయలేక పోయారు. మొదటి వంద ఏండ్లు వృథాగా గడిచి పోయాయి. ఆ తరువాత నన్ను విడిచి పెట్టిన వాడికి అన్ని సంపదలూ సమకూరుస్తానని మాట ఇచ్చాను. కాని రెండువందల ఏండ్లు కూడా నిష్ఫలంగా గడిచి పోయాయి. అటు పిమ్మట మూడో శతాబ్దంలోనైనా నన్ను విడుదల చేసినవారిని చక్రవర్తిగా చేస్తానని, వారికొలువులో వుండి అన్ని కోరికలూ తీరుస్తానని వాగ్దానం చేశాను. అయినా ఆశతాబ్దం కూడా అలా వృథాగా గడిచిపోయింది. అలా అంతులేకుండా నిర్బంధంలో ఉండడంవల్ల నాకు ప్రతి ప్రాణిమీద చెప్పలేని ఆగ్రహం వచ్చింది. ఇక నన్ను ఎవరు విడుదల చేసినాసరే వారిని పట్టి చంపి తీరాలని నిశ్చయించుకున్నాను. అదీ విషయం కాబట్టి నీవుఇప్పుడు నాకు బంధవిముక్తి కలిగించినా నిన్ను సంహరించడం ఖాయం" అని వివరంగా తన చరిత్ర యావత్తూవినిపించాడు. రాక్షసుడు.

జాలరి ఎన్ని విధాల ప్రార్థించినా, ఎంతగా మొత్తుకున్నా వేడినా ఆ రాక్షసుడు వినిపించుకోలేదు. అప్పుడు జాలరి ఆలోచించాడు. అనర్థుడికి

ఉపకారం చేస్తే ఇలాంటి ఫలితమే కలుగుతుందని పాముకు పాలు పోసి పెంచితే అది కాటువేయక మానదని గ్రహించాడు. ఈ మూర్ఖుడితో ఎంతవాదించినా, వాడ్ని ఎంత వేడుకున్నా లాభం లేదనుకుని రాగిపాత్ర మూతపై ఉన్న సాలోమన్ ముద్రలో గల భగవంతుని నామం పఠిస్తూ "దేవునిసాక్షిగా నిన్నొక ప్రశ్న అడుగుతాను బదులు చెప్పు. ఆ పిమ్మట నీవు నన్ను నీ ఇష్టం వచ్చిన రీతిలో నన్ను సంహారించవచ్చు." అని అన్నాడు.

భగవంతుడి నామం ఉచ్చరించడంతో రాక్షసుడు మిక్కిలి భయకంపితుడయినాడు. "అడుగు. నీ ఇష్టమైన ప్రశ్న అడుగు. వెంటనే సమాధానం చెబుతాను." అన్నాడు రాక్షసుడు.

"భగవంతునిసాక్షిగా ఒక విషయం నాకు చెప్పు. నీ ఆకారం చూడబోతే చాలా పెద్దది. అలాంటినీవు ఈ చిన్న రాగిపాత్రలో ఎలా ఇమిడి ఉన్నావు? నీవు నిజంగా ఇందులో ఉన్నావా? నాకు నిజం చెప్పు" అని అడిగాడు జాలరి.

తాను నిజంగానే ఆపాత్రలో ఉన్నానని దేవుడిమీద ప్రమాణంచేసి చెప్పాడు రాక్షసుడు. అయినా జాలరి నమ్మలేదు. అప్పుడు రాక్షసుడు మళ్ళా పొగరూపంలో రాగిపాత్రలో పూర్తిగా దూరిపోయాడు. "ఇప్పుడైనా నన్ను



యుక్తిపరుడైన జాలరి వెంటనే రాగిపాత్రపై సీసంమూత బిగించేసాడు.

నమ్ముతావా లేదా? రాగిపాత్రలో ఎలా ఇమడ గలవని అడిగావు? కళ్ళతో చూచావు కదా ఇప్పుడు?" అన్నాడు రాక్షసుడు సంతోషంగా.

వెంటనే యుక్తిపరుడైన జాలరి ఆ రాగిపాత్రపై సీసపు మూత బిగించి వేశాడు. "ఓరీ, రాక్షసాధమా! ఇక బయటికి రా చూద్దాం ఇప్పుడు నీవే ఎన్నోవిధాల ప్రార్థించాలి. ఈ పాత్రను నేను మళ్ళా సముద్రంలో పారేస్తాను.

అప్పుడేమవుతుంది నీకు!" అని అన్నాడు. "అంతేకాదు. ఈ రాగిపాత్రలో భయంకరుడైన రాక్షసుడున్నాడు. అని అందరికీ తెలిసేటట్లు అక్షరాలు చెక్కుతాను. దాంతో లోకంలో ఎవరూకూడ ఈ పాత్ర మూత తెరవరు. ఇక ఎప్పటికీ నీ గతి ఇంతే" అని కూడా బిగ్గరగా చెప్పాడు.

దాంతో రాక్షసుడికి అర్థమైంది మళ్ళాతాను నిర్బంధంలో పడి ఉండాలని గ్రహించాడు.

"జాలరీ! పోబోకు! నీవు ఏం కోరుకుంటే అది ఇస్తాను. అయితే నన్ను మాత్రం వదిలిపెట్టు" అని ప్రార్థించాడు.

తనకు సకలసంపదలూ లభించాలని నిరుపేద అయిన జాలరి కోరుకున్నాడు. అలాగే వరం ఇచ్చాడు రాక్షసుడు.

"ఇక నన్ను విడుదల చెయ్యి. వెంటనే పాత్ర మూత తెరువు." అని రాక్షసుడు ప్రార్థించాడు.

కాని జాలరి మూత తీయలేదు. పైగా పగలబడి నవ్వసాగాడు. "ఓ మూర్ఖుడా! నీవు బయటికి వచ్చినప్పుడు నేను నిన్ను ఎన్నివిధాల వేడుకున్నాను. అయినా నీవు నా ప్రార్థన పెడచెవిన పెట్టావు. నీకు మహోపకారం చేసిన నన్ను చంపుతానని అన్నావు. నీలాంటి కృతఘ్నుడికి, చేసిన మేలు మరిచేవాడికి ఇదే శాస్తి. అలాంటి వారికి ఇంతకన్నా వేరే శిక్షలేదు." అని పలికి జాలరి ఆ రాగి పాత్రను మళ్ళా సముద్రంలో విసరి పారేశాడు.



అమిత భాగ్యవంతుడై భార్యాబిడ్డలతో సుఖంగా జీవితం గడుపుతున్నాడు

అప్పటినుంచీ జాలరి, రాక్షసుడు చెప్పినట్లుగా అమిత భాగ్యవంతుడై కష్టం లేకుండా భార్యా బిడ్డలతో సుఖంగా జీవితం సాగిస్తూ వచ్చాడు. అది మొదలు మళ్ళా అతను సముద్రం దగ్గరికి వెళ్ళి చేపలు పట్టే అవసరం రాలేదు. కాబట్టి ఎవరైనా ఉపకారం చేసినవారికి ప్రత్యుపకారం చెయ్యాలి. ఒకవేళ అలా చేయడం చేతకాక పోయినా, అపకారం చేసి కృతఘ్నుడు కాకూడదు.

# మాంత్రికపక్షి - ముగ్గురు రాకుమారులు

పూర్వకాలంలో తూర్పుదేశాన్ని ఒకరాజు పరిపాలిస్తూ వున్నాడు. అతనికి ముగ్గురు కుమారులు.

ఇలా వుండగా, ప్రపంచమంతా తిరిగివచ్చిన యాత్రికులు కొందరు రాజు సభకు రావడం తటస్థించిచింది. వారు "బుల్ బుల్ పక్షి" అనే ఒక అపు రూపమైన పక్షిని చూసామనీ, దానికి అద్భుతమైన మంత్రశక్తి వుందనీ, తన దగ్గరికి వచ్చిన మనుష్యులను ఎవరినైనా శిలలుగా మారుస్తుందనీ తెలియజేసారు. అంతేకాక సముద్ర ప్రాంతంలో కొండలమధ్య ఆ పక్షి వుంటుందని కూడా వారు చెప్పారు.

రాజు, రాకుమారులు కూడా ఈ విచిత్రమైన సంగతి విన్నారు. బుల్ బుల్ అనే ఆ మాంత్రిక పక్షిని ఎలాగైనా సరే ఒకసారి చూడాలని కుతూహలి పడ్డారు. నిజానికి రాజుగారికి ఆ వింతపక్షిని పట్టి తెప్పించాలనే వుంది. అయితే, దాని దగ్గరికి వెళ్ళిన మానవులు రాళ్ళుగా మారి పోతారేమోనని అతనికి భయం పట్టుకున్నది. యువకులైన రాకుమారులకు మాత్రం ఏమైనా సరే వెళ్ళి ఆ పక్షిని చూసి తీరాలనే పట్టుదల కలిగింది. అలాంటి సాహసాలు చేయటం వారికొక వినో దంగా వుంటుంది.

ఏమైతేనేం ముందు అందరికన్నా పెద్దవాడైన మొదటి రాకుమారుడు తండ్రిగారి అనుమతి పొంది, ఆ సాహసయాత్రకు బయలుదేరాడు. మొదట తండ్రి వద్దని చెప్పినప్పటికీ అతడు వినలేదు. చివరకు ఎంతో జాగ్రత్తగా వుండమనీ, ప్రమాదం తెచ్చి పెట్టుకోవద్దనీ, కొడుకుకు ఎన్నో విధాలుగా చెప్పి, క్షేమంగా తిరిగిరమ్మని దీవించి పంపాడు.

ఆ విధంగా మొదటి రాకుమారుడు తగిన పరివారాన్ని వెంటపెట్టుకుని

అంచెలంచెలుగా ప్రయాణం చేస్తూ, తుదకు సముద్రతీరాన కొండల మధ్య వున్న ఆ బుల్ బుల్ పక్షి సమీపానికి చేరుకున్నాడు. అల్లంతదూరాన వుండగానే ఆ పక్షిని చూసాడతను. దాని ఆకారం చాలా పెద్దదిగా వుంది. ఒక పెద్ద రాబందు లాగా వెడల్పాటి రెక్కలతో భయంకరమైన గోళ్ళతో వుంది ఆ పక్షి. ఆ సమీపంలోనే అనేకమంది మానవులు శిలలుగా పడివున్నారు. రాకుమారుడు భయపడుతూనే తనకార్యం సాధించుకోవాలన్న సంకల్పంతో దాని దగ్గరకువెళ్ళి పరివారం సహాయంతో పక్షిని పట్టుకోవాలని ప్రయత్నించాడు. కానీ, ఆ పక్షి పైకెగిరి రాకుమారుడి పైనా, అతని పరివారంపైనా ధూళి చల్లింది. అది మంత్ర మహిమో, లేక మరేమిటో తెలియదుకాని, తక్షణమే ఆ రాకుమారుడు, అతని పరివారమూ యావత్తూ కూడా శిలలుగా మారిపోయారు.

బుల్ బుల్ పక్షిని చూసివస్తానని వెళ్ళిన రాకుమారుడు ఎన్ని రోజులైనా తిరిగి రాకపోవడంతో రాజుగారికి, తక్కిన రాకుమారులకు కూడా ఎక్కడలేక ఆందోళన కల్గింది. పెద్ద వాడికి ఏదో ప్రమాదం సంభవించి వుంటుందని వారు అనుకున్నారు. అప్పుడు రెండవ రాకుమారుడు అన్న జాడ తెలుసుకోవడానికై తానూ వెంట కొంత పరివారాన్ని తీసుకొని బయలుదేరాడు. తండ్రి చాలా భీతిచెంది, ఇప్పటికే ఒక కొడుకు జాడ తెలియలేదే, రెండవకొడుకు కూడా వెడుతున్నాడే అనుకుని చాలా దిగులుపడ్డాడు. కానీ, విధికృతం ఎవరూతప్పించలేరుకదా! మనసులో దేవుడిని ప్రార్థించుకుంటూ, రెండవవాడు కూడా వెళ్ళడానికి అంగీకరించాడు.

రెండవ రాకుమారుడు కూడా అన్నను వెతుక్కుంటూ మాంత్రిక పక్షి వున్న ప్రదేశం చేరుకున్నాడు. అయితే, మొదటి వాడికి పట్టిన దుర్గతే ఇతనికీ పట్టింది. పరివారంతోసహా అందరూ శిలలై పోయారు. చాలారోజులు గడిచిపోయాయి. పక్షికోసమని వెళ్ళిన ఇద్దరు కొడుకుల జాడ తెలియలేదు. అసలు

ఉన్నారో లేదో, ఉంటే ఏస్థితిలో వున్నారో అంతుపట్టలేదు. రాజు దుఃఖంతో మంచం పట్టాడు. అప్పుడు మూడవవాడూ, అందరికంటే చిన్నవాడూ, అయిన రాకుమారుడు తాను వెళ్ళి అన్నలజాడ తెలుసుకుంటానని బయలు దేరాడు. రాజుకు ఏ మాత్రం ఇష్టంలేదు. ఉన్న ఒక్క కుమారుడు కూడా ప్రమాదంలో చిక్కుకుంటాడేమోనని రాజు భయం. అయినా చిన్నవాడు తండ్రికి ఎన్నో విధాల ధైర్యంచెప్పి, అలాగే కొద్ది మంది పరివారాన్ని వెంటపెట్టుకుని బయలుదేరి వెళ్ళాడు.

తాను వెడుతున్నది ప్రమాదకరమైన కార్యంమీద కనుక రకరకాల ఆయుధాలు, ఖడ్గం, డాలూ మున్నగునవి కూడా వెంట తీసుకుని వెళ్ళాడు. అడవులు, కొండలు, కోనలు దాటి చివరకు సముద్రంతీరం చేరుకున్నాడు. అక్కడ పర్వతాలమధ్యనే బుల్ బుల్ పక్షివుంది. అయితే, రాకుమారుడు ఏకాఎకి దాని సమీపానికి వెళ్ళలేదు. అప్పటికి పొద్దుగూకింది. ఎందుకైనా మంచిదని ముందుగా ఒకరిద్దరు భటులను పక్షి వున్న చోటుకు పంపించాడు. వారు తిరిగి వచ్చి పక్షి నిద్రపోతున్నదని చెప్పారు. అదే తగిన సమయమనుకొని రాకుమారుడు కత్తి, డాలు తీసుకొని మాంత్రిక పక్షి సమీపానికి వెళ్ళాడు. అనుకున్నట్లుగానే పెద్ద కొండంత వుంది ఆపక్షి. దాని రెక్కలు చాలా పెద్దవి. కొండరాళ్ళమధ్య తల వాల్చుకుని నిద్రపోతున్నది. ఆ సమయం కనిపెట్టి రాకుమారుడు అది మేల్కొని కళ్ళు తెరిస్తే, తాను శిలగా మారిపోయే ప్రమాదం వుందని గ్రహించాడు. వెంటనే ఆ మాంత్రిక పక్షిని హతమార్చడం మంచిదని అనుకున్నాడు. ఇలో అనుకుని ఒరనుండి కత్తి దూసాడు. డాలు తన మొహానికి అడ్డం పెట్టుకున్నాడు. సరిగ్గా ఆ సమయానికే మాంత్రికపక్షి మేల్కొని కళ్ళు తెరిచింది. దానికి ఎదురుగా ఒక యువకుడు కత్తి, డాలు పట్టుకుని వుండడం

చూసింది. ఆ యువకుడి ధైర్య సాహసాలకు పక్షి ఆశ్చర్యపడింది. వెంటనే మానవభాషలో ఇలా అన్నది.

"భలే వీరుడా! సాహసవంతుడవే. ఇంతకాలంగా చూస్తున్నాను. ఎవరూ నాతో యుద్ధంచేయడానికి, నన్ను ఓడించడానికి ఇంతవరకూ సాహసించ లేదు. అందుకనే పాపం అందరూ శిలలుగా మారిపోయారు. ఇన్నాళ్ళకు నాకు నచ్చిన వీరుడవు నీవు లభించావు. నీ సాహసానికి మెచ్చుకున్నానయ్యా. జయం నీదే నీకు కావలసింది ఏదోకోరుకో. ఇస్తాను."

ఇలా బుల్ బుల్ పక్షి అనగానే రాకుమారుడు మొదట విస్మయం చెందాడు. తర్వాత వెంటనే తెప్పరిల్లుకొని "చాలు చాలు నీ కల్లబొల్లికబుర్లు. ఇలాంటి మాటలతో నన్ను మోసం చేయాలనుకున్నావా? అది నీతరం కాదు. ముందు నా అన్నలిద్దరినీ ప్రాణాలతో నా కప్పగించు. లేకపోతే నీకు నాచేతుల్లో చావు తప్పదు" అని కత్తి ఎత్తాడు.

అప్పుడు వెంటనే మాంత్రికపక్షి నెమ్మదిగా అనునయ వాక్యాలతో "వీరుడా! చెప్పానుగా నీ సాహసానికి సంతోషించానని. నేను ఓడిపోయాను. ఇదిగో నా దగ్గర మాంత్రిక అంగుళీయకం ఒకటి వున్నది దానిని నీ కిస్తున్నాను. అది తీసుకున్న వెంటనే నీవు నన్ను సూటిగా నా కళ్ళల్లోకి చూడవచ్చు. నీకెలాంటి ప్రమాదమూ జరగదు." అని చెప్పి ఆ ఉంగరాన్ని అతనికి ఇచ్చింది. అంతట రాకుమారుడు ధైర్యం తెచ్చుకుని మాంత్రిక పక్షి వంక చూసాడు. దాని కళ్ళు ఎర్రగా చింతనిప్పుల్లా వున్నాయి.

మాంత్రికపక్షినైతే వశం చేసుకున్నాడు రాకుమారుడు. మరి తన అన్నల మాటేంటి? అని సంశయంతో అతను ఆలోచనా నిమగ్నుడై వుండగా పక్షి మళ్ళీ మాట్లాడింది "వీరాగ్రేసరా! దిగులు పడకు. అదుగో! ఎదురుగా ఆ

కొండ ప్రక్కనే రెండు గుట్టలు కన్పిస్తున్నాయి. ఒకటి మానవులు శిలలుగా మారిన రాళ్ళ గుట్ట. రెండవది మాంత్రిక ఇసుక పోసిన గుట్ట. ఆ ఇసుక కొంచెం తీసుకుని రాళ్ళ గుట్టమీద చల్లితే, మానవులంతా సజీవులై ఎప్పటిలా మామూలు మనుషులౌతారు" అని చెప్పింది.

తర్వాత ఎలాంటి ఆలస్యం చేయకుండా రాకుమారుడు ఆ గుట్టల దగ్గరికి వెళ్ళాడు. గుప్పెడు మాంత్రిక ఇసుక తిసుకుని శిలలమీద చల్లాడు. ఆ క్షణమే అంతవరకూ శిలలుగా పడివున్న మానవులంతా మామూలుగాలేచి నిల బడ్డారు. వారిలో తన అన్నలిద్దరితోపాటు ఎందరో దేశదేశాల రాకుమారులు కూడా వున్నారు. వారంతా తమకు మహోపకారంచేసి, ప్రాణదానం ఒసగిన ఆ చిన్నారి వీరునికి అనేక కృతజ్ఞతాభివందనాలు తెలియజేసి వెళ్ళిపోయారు. అన్నలిద్దరూ తమ్ముడి దగ్గరకు వచ్చి, అతడ్ని కౌగలించుకున్నారు. "ఏరా! తమ్ముడూ! ఎలా వచ్చావిక్కడికి? ఈ భయంకరమైన మాంత్రికపక్షిని ఎలా లొంగదీసుకున్నావు?" అని ఎక్కడలేని ఆసక్తితో గుచ్చి గుచ్చి అడిగారు. చిన్నవాడైన రాకుమారుడు తాను ఇంటినుండి బయలుదేరినది లగాయతూ జరిగిన వృత్తాంతం యావత్తూ పూసగుచ్చినట్లు వారికి వివరించి చెప్పాడు. తమ్ముడు సాహసానికి అన్నలు ఎంతో సంతోషించారు. "ప్రాణాలు పోగొట్టుకున్న మాకు తిరిగి ప్రాణాలు తెప్పించావురా. నీ మేలు ఈ జన్మలో మర్చిపోము" అని అభినందించారు.

అనంతరం రాకుమారులు ముగ్గురూ పరివారంతో తమ పట్టణానికి బయలుదేరారు. అయితే, పెద్ద వాళ్ళయిన అన్నలు మొదటివాడూ, రెండవవాడూ చాలా దుర్మార్గులు. కేవలం స్వార్థపరులు. చిన్న వాడయిన తమ తమ్ముడు ఇంతటి సాహసం చేసి తిరిగివస్తే తమ తండ్రిగారు రాజ్యం యావత్తూ వాడికే

అప్పగించవచ్చుననీ, వాడిని ఎలాగయినా దారిలో అంతం చేయడం మంచిదనీ లోలోపల నిశ్చయించుకున్నారు.

తిరుగుప్రయాణంలో అరణ్యంలో ఒక తటాకం వద్ద వారు గుడారాలు వేసుకుని మకాం చేయవలసి వచ్చింది. రాత్రివేళ కావడం వల్ల గుడారాలలో చిన్న వాడయిన రాకుమారుడూ, భటులు కూడా నిద్రపోతున్నారు. అయినా దుర్బుద్ధి గల అన్నలిద్దరూ నిద్రపోలేదు. ఇదే తగిన సమయమని గాఢ నిద్రలో వున్న రాకుమారుడ్ని కాళ్ళూ, చేతులు కట్టి ఆ తటాకంలో పడేసారు. పీడా వదిలిందని చేతులు దులుపుకుని తెల్లవారగానే పరివారంతో కూడా బయలుదేరి తమ నగరం చేరుకున్నారు. చిన్న వాడయిన రాకుమారుడు ఏడని భటులు విచారించగా వాడు ముందే నగరానికి వెళ్ళిపోయాడని అన్నలిద్దరూ సమాధానం చెప్పారు.

క్షేమంగా తిరిగి వచ్చిన పెద్ద కుమారులిద్దరినీ చూసి రాజు చాలా సంతోషించాడు. అయితే, చిన్నవాడు ఏడని అడిగినప్పుడు మాకంటే ముందుగానే వచ్చాడే వాడు! ఏడీ వాడు ఎక్కడ తిరుగుతున్నాడో? ఏమో? అని ఏమీ ఎరగనట్లు బదులుచెప్పారు. వారి మాటల వాలకం చూస్తే రాజుకు అనుమానం కలిగింది. వాళ్ళు తనదగ్గర ఏదో దాచిపెడుతున్నారనీ, వాళ్ళే సొమ్ముకోసం చిన్నవాడికి ఏదైనా ఆపద తలపెట్టి వుంటారనీ రాజు ఊహించాడు.

ఇక్కడ ఇలా వుండగా, అక్కడ తటాకంలో పడిన చిన్న రాకుమారుడు తెలివి తెచ్చుకుని లేచాడు. మంచి వాళ్ళకు ఎన్ని ఆపదలు వచ్చినా రక్షించే

వాడు ఆ సర్వేశ్వరుడు వున్నాడుకదా! చిన్నారి రాకుమారుడు తాను అపాయ స్థితిలో వున్నట్లు గ్రహించాడు. తన అన్నలే ఈ దురాగతానికి పాల్పడ్డారని కూడా తెలుసుకున్నాడు. అంతేమరి! విధిలీల. మేలు చేసిన వాడికే కీడు తల పెడ్తారు దుర్మార్గులు.

ఏమయితేనేం? రాకుమారుడు గుర్రమెక్కి, క్షేమంగా తమ పట్టణానికి చేరుకున్నాడు. వృద్ధుడై, మంచం పట్టివున్న రాజును కలుసుకుని ఆయన్ను పరామర్శించాడు. చిన్నకొడుకును చూడగానే తండ్రికి ప్రాణాలు లేచి వచ్చి నట్లయ్యింది.

"ఏం జరిగిందిరా తండ్రీ! మీ అన్నలు నిన్ను గురించి ఏవో కథలు అల్లి చెప్పారే. బుల్ బుల్ పక్షిని తామే వశపరచుకొన్నట్లు, ఎక్కడలేని వీర త్వాన్ని ప్రదర్శించినట్లు చెప్పుకున్నారే. అసలు జరిగిన విషయమేంటి? యదార్థం నాకు వినిపించు" అన్నాడు వృద్ధరాజు.

అంతట చిన్నారి రాకుమారుడు జరిగిన సంగతులన్నీ తండ్రిగారికి విని పించాడు. మాంత్రిక పక్షిని తాను జయించి అంతవరకు శిలలుగా మారిన అన్న లిద్దరినీ బ్రతికించాననీ తెలియజేసాడు. అందుకు నిదర్శనంగా తాను తెచ్చిన మాంత్రిక అంగుళీయకం తండ్రికి చూపించాడు.

చిన్న కుమారుడ్ని దుర్బుద్ధితో అన్నలిద్దరూ కృతఘ్నులై నీళ్ళలో పడవేసారని విని రాజు ఆగ్రహోదగ్రుడైనాడు. తన రాజ్యం యావత్తూ చిన్న కుమారునికే అప్పగించి, అతన్ని రాజుగా పట్టాభిషిక్తుడ్ని చేసాడు. అప్పుడు పట్టణమంతా పెద్ద ఉత్సవం జరిగింది. పౌరులందరూ రకరకాల వేడుకలు చేసు

కుంటూ ఆనందంగా గడిపారు. నిజం బైటపడిన అన్నలిద్దరూ ప్రజలకు మొహ చూపించలేక తాము చేసిన ఘోర అపరాధానికి అవమానంతో కుమిలిపోతూ తల వాల్చుకున్నారు.

కానీ, సజ్జనుడు ఎప్పుడూ సజ్జనుడే. అపకారికి కూడా ఉపకా చేయడం అతని స్వభావం. ఘోరనేరానికి పాల్పడిన అన్నలిద్దరికీ రాజుగా మరణదండన విధించగా, చిన్నారి రాకుమారుడు తండ్రిని వేడుకున్నాడు.

"నాన్నగారూ! శిక్షించడానికి, రక్షించటానికి ఆ సర్వేశ్వరుడే సమర్థు కాబట్టి అన్నలిద్దరినీ క్షమించి, వారికి ఉరిశిక్ష రద్దు చేయండి. మన రాజ్యం యథాప్రకారం వాళ్ళకుకూడా రావలసిన భాగం ఇచ్చి సంతోషపెట్టండి. ఈశు సమయంలో మన మందరం ఆనందంగా వుండాలికానీ ఎవరూకూడా విచ గ్రస్తులు కాకూడదు. అన్నిట్లోకి దయాగుణం చాలా గొప్పది నాన్నగారూ అని చిన్నవాడైన రాకుమారుడు తండ్రికి నచ్చ చెప్పాడు.

ఆ విధంగానే రాజు పెద్ద కొడుకులిద్దరినీ కూడా మన్నించి వా కూడా రాజ్య భాగాలను ఇచ్చాడు. అప్పటినుండి అన్నలు కూడా ఎంతో బ తెచ్చుకుని రాజైన తమ్ముడ్ని అన్ని విధాలా, ప్రేమిస్తూ, గౌరవిస్తూ కాలం గడ సాగారు.



చదివించండి.

# తేటతెలుగులో పిల్లలకు, పెద్దలకు ఉపయుక్త సాహిత్యం

# బాలానంద బొమ్మల బాలసాహిత్యం



శ్రీషిర్డీసాయి జీవితచరిత్ర
అక్బర్‌బీర్‌బల్ వినోదకథలు
తెనాలిరామకృష్ణునిసంపూర్ణ హాస్యకథలు
అలీబాబా 40 దొంగలు
అల్లావుద్దీన్ అద్భుత దీపం
గలివర్ సాహస యాత్రలు
శ్రీ శ్రీ శ్రీ మర్యాదరామన్న కథలు
భట్టివిక్రమార్కుని సాహస కథలు
భేతాళకథలు
మొగల్ సామ్రాజ్య కథానాయకులు
ప్రవక్త మహమ్మద్
ఏసుక్రీస్తు మహిమలు
మదర్ థెరిసా
రవీంద్రనాథఠాగూర్
యోగివేమన
భగత్‌సింగ్
అంబేద్కర్
యశపాల్ కపూర్
భగవతీచరణ్
సుభాస్ చంద్రబోస్
చంద్రశేఖర ఆజాద్
జయప్రకాష్ నారాయణ్
సంఘసంస్కర్త రాజారామమోహన్‌రాయ్
పూజ్యబాపూజీ
దశావతారాలు
శ్రీకృష్ణ లీలలు
పరమానందయ్య శిష్యులు
శ్రీవెంకటేశ్వర లీలలు

బొమ్మల పంచతంత్రం 2 భాగాలు
బొమ్మల రామాయణం
బొమ్మల భారతం
బొమ్మల భాగవతం
బొమ్మల శ్రీఅయ్యప్ప లీలలు
బొమ్మల శ్రీరామపట్టాభిషేకం
బొమ్మల జైవీరహనుమాన్
బొమ్మల పల్నాటి వీరచరిత్ర
బొమ్మల బాలనాగమ్మ
బొమ్మల శ్రీకాళహస్తి మహాత్మ్యం
బొమ్మల శ్రీశైలక్షేత్ర మహాత్మ్యం
బొమ్మల శ్రీసింహాచల క్షేత్రము
బొమ్మల శ్రీయాదగిరి నరసింహస్వామిచరిత్ర
బొమ్మల శ్రీకాశీరామేశ్వర మజిలీలకథలు
బొమ్మల కోటప్పకొండ చరిత్ర
బొమ్మల శ్రీవినాయక విజయము
బొమ్మల శ్రీభద్రాచల మహాత్మ్యం
బొమ్మల శ్రీపాండురంగ లీలలు
బొమ్మల శ్రీరాఘవేంద్ర లీలలు
బొమ్మల కనకదుర్గ మహాత్మ్యం
బొమ్మల శివ లీలలు
బొమ్మల జగద్గురు శంకరాచార్య
బొమ్మల సహస్ర శిరచ్ఛేద అపూర్వ చింతామణి
బొమ్మల శ్రీసత్యనారాయణ స్వామి వైభవం
బొమ్మల నవగ్రహపూజా మహిమ
బొమ్మల శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామి చరిత్ర
బొమ్మల కుశలవుల కథ

